GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన పవిత్ర మాస పత్రిక

సంపాదకుఁడు :

డాక్టరు కే. యస్. కేసరి

సంపుటము ౨౧]     జూలై 1952     [సంచిక ౭




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్థసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

ఆంధ్ర దేశమంతటా తండోపతండములుగా

ప్రజలు చూచుచున్నారు!



# విషయసూచిక






జయజయ గృహలక్ష్మి సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



# మద్యనిషేధం - శాసన సభ్యులు



ఈ మధ్య మద్రాసు శాసన సభలో ప్రసంగిస్తూ కొందరు సభ్యులు మద్య నిషేధ చట్టాన్ని రద్దుచేయాలని సూచించారు.

ఇట్టి సూచన చేయడమునకుగల కారణములలో నొకటి యీ చట్టము ఫలప్రదంగా అమలు జరుగని సందర్భమున దీనివలన ప్రజాసామాన్యానికి లాభంలేకపోగా ప్రభుత్వ ఆదాయం తగ్గిపోవడం, తరుగును పూడ్చుడానికి ప్రజలపై క్రొత్త పన్నులు విధించునట్లుగా ఏర్పడం హర్షించ తగినదికాదని అయియుండవచ్చును. కాని మద్య నిషేధపు బిల్లును శాసనచేసే సమయంలో ప్రజల ఆర్థిక, ఆరోగ్య, సౌభాగ్యములను దృష్టిలో నుంచుకొని ప్రజాశ్రేయస్సుకని ఉద్దేశించబడింది. అంటే యీ చట్టము యొక్క ఉద్దేశాలు మహోత్తమ మయినవి. కాని అమలుపరచే సందర్భమున మాత్రం సమకూరవలసినన్ని సత్ఫలితాలు లభ్యముకానిమాట వాస్తవమే. అంత మాత్రము

చేత యీ శాసనాన్ని రద్దుచేసి ప్రజలను పూర్వమట్లు త్రాగనివ్వండనడం వివేకవంతము కాదు.

మద్యపానమువలన సామాన్య ప్రజాకుటుంబాలు ఎలా గుల్లగుతవో మనకు తెలియనిది కాదు. త్రాగుడు మూలంగా ఆరోగ్యక్షీణత, గృహాల్లో ఎల్లప్పుడు ఆర్థిక కల్లోలం. నీతి నియమాలకు, పరువు ప్రతిష్టలకు దూరం కావడం సంభవిస్తుంటవి. దాని మూలంగా గృహిణులు ఎన్నెన్ని బాధలకు, అవస్థలకు, అవమానాలకు గురి కావడం తటస్థిస్తుంటుందో గమనించతగిన విషయం. ఈ దుర్భర జీవితమునుండి విముక్తిచేయుట కొరకనే మద్యపాన నిషేధ ఉద్యమాన్ని జాతీయ ఉద్యమంతో మేళవించి దానిని చట్టంగా కాంగ్రెస్ ప్రభుత్వముల హయాంలో సాధించడం జరిగింది.

ఈ చట్టమువలన సంపూర్ణ సత్ఫలితాలు సమకూరలేదంటే దానికి కారణం ప్రజాసహకారలేమితోబాటు ప్రభుత్వోద్యోగుల కార్యదీక్షలోపం, ప్రభుత్వాసక్తి పట్టుదలలేమి అని చెప్పకతప్పదు. అయితే చట్టాని రద్దుచెయ్యవలసినదిగా కోరడంకంటె ప్రభుత్వము ఆ చట్టాన్ని ఫలప్రదంగా నమలుపరచేలాగున తాము సమీకరించిన ప్రజాబలంతో సహకరించడం ఉత్తమ మార్గం. ఆ నాడు దేశాభ్యుదయానికి పాటు పడిన వారగుతారు.

మద్యపానాన్ని ఏ సామాన్య గృహిణి హర్షించదు. దానివలన ఆరోగ్య సౌభాగ్యాలు నాశనమగునని తెలుసును. తమ పురుషులు తప్పత్రాగి పరువు ప్రతిష్టలు లేకుండా రోడ్లమీదపడి దొర్లాడుతుంటేను, యింటికివచ్చి దుర్భాషలాడి తమ్ము చావబాదుతుంటేను స్త్రీలు సహించుతారనడంకల్ల. న్యాయస్థానాలు, పోలీసులు త్రాగి తందనాలాడినందుకు తన భర్తను శిక్షిస్తుంటే ఏ స్త్రీ చూచి ఆనందించలేదు. తమ కుటుంబములయొక్క సౌభాగ్యమునకు మద్య నిషేధ చట్టము సర్వతోముఖంగా ఉపకరిస్తుందని మహిళాలోకానికి తెలుసును.

ఈ పరిస్థితులలో శాసన సభ్యులు తాము ప్రజాప్రతినిధులమన్న విషయం జ్ఞాపకముంచుకొని వారి శ్రేయస్సు నుద్దేశించి కృషి చేయడమే వారి విధ్యుక్త ధర్మం.

---

# స్వామి ధర్మమా?

శ్రీ సి. హెచ్. లక్ష్మయ్య

(శ్రీరామ పట్టాభిషేకానంతరము, సీత పునస్సమాగమ విజయంలో ఆమెశీలమును శంకిస్తూ, తనపైవచ్చిన ప్రజానింద సందర్భంలో రాజారాముడు తన కర్తవ్యతా నిర్వహణమునుగూర్చి ఆలోచించునపుడు స్త్రీ ప్రాధాన్యత పూర్తిగా విస్మరించబడుటయేగాక ఆమె అత్యల్పంగా ఎంచబడినది. సీత మహాసాధ్వియని యెరిగియు, లక్షోప లక్షల ప్రజల సమిష్టి రంజనము దృష్ట్యా వ్యక్తియైన సీతను విడనాడటమే నిస్వార్థమునకును, స్వామి ధర్మమునకును చిహ్నమని యెంచెనేగాని, ఆ సీతయొక్క వ్యక్తిగతాధిక్యతను వదలివేసినా, ఆమె లక్షోప లక్షలుగానున్న ప్రజా బాహుళ్యంలో సగభాగానికి ప్రాతినిధ్యము వహించే నారీలోకానికి చెందియున్నదనీ, తాను సీత ద్వారా వారందరికీ హానికరంగా ప్రవర్తిస్తున్నానని తలంచలేకపోయెను – రాజైన రాముడు.

ఇట్లు అల్పంగా పరిగణింపబడిన స్త్రీకి ప్రాధాన్యత నిప్పించటమే నాయీ రచనోద్దేశము.

దీనికి మూలము పూజ్యులు శ్రీ అక్కిరాజు నిత్యానందంగారు తెలుగులో దృశ్యనాటక రూపమున రచించిన 'కుశలవ' ఇందులో వీరు రాముడు తాను చేయనున్న కార్య కాఠిన్యతపై బడ్డ ఆవేదనను మాత్రమే చిత్రించారు.)

సమయం : సాయంత్ర సంధ్యాసమయం.

ప్రదేశం : అయోధ్యానగరం - రాజాంతఃపురములోని ఏకాంతమందిరము - రాజారాముడు ఒంటరిగా మెఖమల్ గడ్డ మెత్తలు పొదిగిన సోఫాలో చేరిగిలబడి కూర్చొని, ఆలోచనలలో మునిగినట్లు కనిపిస్తున్నాడు, అప్పుడప్పుడు ఆతురతతోగూడిన ముఖముతో ద్వారమువైపు చూస్తూ వుంటాడు. ఇంతలో మాడిపోయిన మోముతో అడుగులో అడుగిడుచూ వస్తున్న ఆంతరంగిక సేవకుడు భద్రుణ్ణి చూడగానే రాజారాముని ముఖ మొక్కసారిగా వెలవెలబోవును. వెంటనే తన్ను తాను సంభాషించుకొని-

రాజారాముడు:-(గంభీరంగా) భద్రా! లోనికిరమ్ము

భద్రుడు కంపించుచున్న శరీరమును బలవంతాన నిబ్బరింపజేసికొని, వంగి రాజారామునకు నమస్కరించి, చేతులు కట్టుకొని ఆయనకుకొంచెము దూరములో నిలుచుండును. ఆతని గుండెలలో ఏదో కలియబెట్టినట్లుగా ఆతనిముఖ కళవళికలు సూచిస్తున్నవి.

రా. రా:-భద్రా! సీత పునస్సమాగమ సందర్భమున ప్రజాభిప్రాయము నరయుటకుగదా నిన్ను నియోగించితిని. విశేషములుగలవా?

భద్రుడు:-(గద్గద స్వరముతో) చిత్తము (హస్తములు మోడ్చును) ప్రభూ! నన్నేల యిట్టి కార్యమున కనిచితిరి! చెప్ప నోరాడకున్నది. నోరార చెప్పి, దీనిలో నేను పాలు పంచుకొనలేను. ఇంత కన్నను నాకంత ముత్తరింపుడు ప్రభూ! (వడలంతా చెమటలు గ్రమ్మును.)

రా॥రా:-(గట్టిగా) భద్రా! సేవకా ధర్మము నీకిది. భయమువీడి, ఆరసిన దానిని నివేదింపుము.

భద్రు:-అవును ప్రభూ! సేవకుని ధర్మము - కాదు కాదు - కిరాతకుని ధర్మము. స్వామీ! చెప్పక తప్పదా? అయ్యో! సేవకుని ధర్మమింత క్రూరమా? ప్రభూ! పరమ సాధ్విని, అయోనిజను, సీతామహాతల్లిని, రావణునియింట నున్నందులకు లోకులు శంకించుచున్నారు ప్రభూ. నీచపు లోకులారా! ఎన్ని జన్మలకైనా మీకీ పాపము తీరునా! పూతచారిత్ర, పతివ్రతామతల్లిపైనా యిట్టి మీ అభాండం! పావకుని సైతము పునీత మొనర్చిన పరమ పవిత్రురాలు, జానకమ్మ తల్లికా మీరీ కళంక మాపాదించుట? ఛీ! ఛండాలులారా! అయ్యో నాకిక ముక్తి లేదు. నాతల్లి సీతమ్మ యెడలనా నేనిట్టి నిందలు వినుట కాదు ప్రభూ! ప్రజలు వట్టి మూఢులు. వివేక శూన్యులు. సత్యా సత్యములు గ్రహింపలేకున్నారు. దీనినే బహు జనాభిప్రాయముగా పాటింపవలదు ప్రభూ! స్వామీ! ఈ సేవకుని క్షమింపరా! వద్దు వద్దు. తత్క్షణమే యీ కిరాతకుని శిరము ఛేదించుడు ప్రభూ. (కూలబడి పోవును.

వ్యాకుల హృదయముతో రాజారాముడులేచి భద్రుని సమీపించి, యించుకంతగా వణుకుతున్నట్లు కనిపించుతున్న హస్తములతో భద్రుని భుజములు పట్టుకొని ఆప్యాయంగా లేవదీసి.

రా॥రా:-భద్రా! భయమువలదు. సేవకా ధర్మమున కంటెను స్వామి ధర్మము కఠినతరము. ఇంక నీవు వెళ్లు. లోపల కెవ్వరినీ రానివ్వవలదు

చీకటి కొంచెము కొంచెముగా మందిర మంతయు అలముకొన జొచ్చెను. వ్యథిత హృదయంతో, చేతుల వెనుక నుంచుకొని రాజారాముడు రెండు మారులు అటునిటు మందిరాంతర్భాగంలో బరువుగా నడిచి, తన పూర్వపు సోఫాలో కూలబడును. మోము మాడిపోయి, నిశ్చేష్టగా మారును. అంతకంతకు చీకటి మందిర మంతయు చిక్కబడును. కొంత తడవునకు యించుకంత తేరుకొనును. సీతకు తనకుగల హృదయ బాంధవ్యమునుగూర్చి మనస్సు అలోచిస్తూ వుంటుంది. తాను లక్ష్మణుడు తూణీరముల మూపున గట్టుకొని, ధనుస్సులను చంకల నిడుకొని, రాజోచితాడంబరము లేవియు లేక, సామాన్య మునిబాలక వేషములతో పాదచారులై, విశ్వామిత్ర మహాముని కిరువైపులనుండి మిధిలా నగర రాజ వీథుల, వివిధ దేశ మహారాజ పుత్రుల రథములన్నియు ముందు ముందు రయమున సాగిపోగా, వాటి వెనుక గంభీరంగా జనకరాజ దర్బారునకు వచ్చుచున్న సమయంలో, రాజాంతఃపురమునుండి చెలికత్తెలచాటున శరీరమునంతయు దాచుకొని, నవయౌవనముతో తొణికిసలాడుతూ, పూర్ణిమ చంద్రుని బోలు మోముతో జనకరాజ ప్రేమంపుపట్టి తదేక దీక్షతో తన్ను జూచినప్పుడు, ఆ యమ ముద్దు ముఖము తన హృదయంలో హత్తుకొనటమూ; తాను రాజదర్బారులో ఆశీనుడై యున్నప్పుడు, శివ ధనువు నెక్కుబెట్టు సమయమున తిలకించుటకు మైథిలి రాజవేదికను ప్రవేశించి, జనకుని సరసను కూర్చొనబోవుచూ, సురుచిర మందహాస వదనముతో తన్ను వీక్షించినపుడు, ఆ ముగ్ధమోహన మూర్తిలో తాను లీనమై, కొంత తడవు మయిమరచినట్లు తాను బొందిన ఆ నాటి యనుభూతి; తానే యనుభూతి శక్తితో శివ ధనుర్భంగము గావించినది; సాంప్రదాయము, వంశకీర్తి ప్రతిష్టలను సుస్థిరంగా ప్రతిష్ఠించిన యశస్సును కలకాలము నిల్పుకొనుటకు, వలచి,

హృదయమిచ్చిన నిండుయౌవనయైన హృదయాంగిని సీతను బహుకాలము వదలుటకు సిద్ధపడి, అరణ్యవాసమునకు తాను ప్రయాణము కట్టినపుడు, పసితనము నుండి అంతిపురినిపీడని అతిసుకుమార శరీర, జనకరాజ ముద్దుపట్టి కఠినకంటకావృతమైన విపిన భూములవాసమునకు సైతము వెరువక, తన తోడిదే సర్వస్వమనియెంచి, తన కోసమై తనతోరా సమకట్టుట ; భరద్వాజాశ్రమమున నున్నపుడు గోదావరీ నదీ పుణ్యోదకముల స్నానమాడి, ఆ నదీతీర సుందర లతాతరు శీతలచ్ఛాయల సీతతో గడిపిన ఏకాంత జీవితము ; వనభూములమధ్య నిర్మించుకొన్న తమ పర్ణశాలను అనుదినము అరుణోదయమునకుముందే శుచిపరచి, అలంకరించి, అటుపిమ్మట ఆశ్రమ పరిశ్రమ ప్రాంతముల ప్రొద్దస్తమానము ఆశ్రమమున దిరిగి, కోరికోరి ఏరితెచ్చిన వివిధ సువాసనా కుసుమ కోమల రేకుల నొకటొకటిగా విడదీసి, మనోహరంగా పూలసెజ్జ నమర్చి, దానిపై తన కోమల హస్త పల్లవములతో తన్ను పరుండబెట్టి సుఖనిద్ర బుచ్చటము ; బంగారులేడిని కోరినదే తడవుగా ముందు వెనుకలారయక ఆ మృగమును పట్టితెచ్చుటకు తాను పరుగెత్తటం ; సీతకోసం తాను దేశములు గాలించటం ; తన ప్రియురాలి కోసమే, అజేయబలమునకు వెరచియో లేక శరణాగతరక్షణము అడ్డువచ్చియో అధర్మమని తెలిసియు, మరుగున దాగియుండి వాలిని కూల్చటం; అయోనిజ కోసమే నోరులేని వానరమూకచే రేయింబవళ్లు పనిచేయించి, అనంతయగు వారిధికి వారధి కట్టటం ; తన హృదయ రాణికోసమే ఒక మదాంధుడుచేసిన నీచకార్యమునకు లంకా నగరమునంతయు నెత్తుటి కాల్వలు గట్టించటం ; తనకే మాత్రం శంకలేకపోయినా లోకంకోసం-కాదు-కాదు-కాబోయే రాజారాముడు కళంకవతియైన భార్యను చేబట్టినాడన్న కళంక నివారణకోసం పెద్దలమాటవిని పావకుని జ్వాలా కలలకు సుష్కశరీరయైన సీత నర్పించటం ; పుష్పక విమానంలో అయోధ్యానగరం తిరిగి వచ్చునపుడు పునస్సమాగమోత్సాహముతో మురిసిపోయి, వాడిపోయిన లేతచెక్కిళ్లను కోమలంగా తన వక్షాని కంటించి నవ్వే తెల్లని కండ్లతో అమాయకంగా తన మోమును తిలకించి, ఆనందపరవశయవటం ; సంతోషానందోత్సాహాలు ముప్పిరికొనగా పట్టాభిషేక మహోత్సవము జరుపుకొనటం ; ఆ మహోత్సవములో తన కంటెను మిన్నగా సీతకు జనులెల్లరు ఆదరాభిమానములతో ప్రేమ పురస్సరముగా ఆశీస్సు లివ్వటం ; చూలాలయిన నాటి నుండి రోజుకు రోజూ ఆమె ప్రతి అవయవము పొందెడి నూతన పరిణామములతోను చంద్రకాంతుల మించెడి తెలికాంతుల నీనెడి శరీర చ్ఛాయలతోను దినదిన ప్రవర్ధమానము జెందెడి తన మనసిజరాణి దివ్య సుందరమూర్తిని తాను నిత్యము తనివిదీర తిలకించుచూ నవ్యానుభూతిని పొందటం ; రాణివాసంపు కోమలాంగులంతా అంతిపురికేతెంచి, కన్నుల పండువుగా ఆనందముప్పొంగ సీమంతోత్సవం జరిపి వెళ్లిన పిదప, ఆనంద డోలికల పారవశ్యత నొందిన తన ప్రియురాలిని హృదయానికి హత్తుకొని, ఆ యమ ముద్దుమోమును ముద్దిడినప్పుడు తనకన్నులలో కన్నులజేర్చి, ప్రశాంత చిత్తములతో శాంతిమయ జీవితముల గడుపుచున్న మునిపత్నులు వశించు తపోవన వాటికల దర్శింప మనస్సుబలాటపడుచున్నదని మనోవాంఛితాన్ని, కమనీయ స్వరమున ప్రార్థనా పూర్వకముగా వెలువరించినపుడు వల్లెయని, తానే స్వయముగా గొనిపోయెదనని మాట యివ్వటం ఆదిగాగల యుదంతము లన్నిటిని మనస్సు ఒకసారి వేగంగా పరిభ్రమణము చేసెను. తోడనే ఒక్కొక్క యుదంత మొక్కొక్క నారాచముగా ఆతని హృదయ కుహరములో ఒక్కుమ్మడిగా గ్రుచ్చుకొనును. దానితో ఆపాదమస్తకం అల్లడితల్లడయి ముచ్చెమటలుగ్రమ్మి నీరసంగా పడిపోవును. ఇంతలో ఏదో అంతఃశ్శక్తి తన్నుతట్టుచూ, "రాజారామా! రాజారామా!" అని పిలచినట్లగును. తోడనే ఉలికిపాటున కన్నులు తెరచును. ఎదురుగా రాజారాముడు గంభీర ముద్రలో నిలుచుండుట చూచి కన్నులు మిరుమిట్లు గొలుపును. కన్నులు తమ చూపులను మందిరము నలుదిక్కులకు బరుపును.

(సశేషము)



కేసరి విద్యాలయముల వార్షికోత్సవ సందర్భమున 'రాణీ ప్రమీల' నాటక మండలి రాణి వేషధారిణియగు బాలిక.



శ్రీమతి వాసిరెడ్డి సుశీలాదేవిగారు

ఈమె తుమ్మపూడి గ్రామ కాపురస్థులగు శ్రీపిచ్చయ్యచౌదరిగారి కుమార్తె. ఈమెకు పత్రికారచన అంటే చాల ప్రీతి. ఈమెచిన్న చిన్న రచనలు తరచుగా మాపత్రికలో వెలువడుచుండటం పాఠకులకు విదితమే.

# మనదేశములో స్త్రీలు వహించవలసిన బాధ్యత

శ్రీమతి వసుతూవు జానకీబాయి

అనేక వత్సరములనుండి మనదేశములో స్త్రీలు పురుషులవలె ఇంచుమించుగ సమానమగు సాంఘిక ప్రతిపత్తి అనుభవించుచువచ్చిరి. కాని కొన్ని ఏండ్లనుండియు స్త్రీకి తన సాంఘిక జీవనములో తగిన హక్కు, స్వాతంత్ర్యములు లభించుటలేదు. భారతదేశములో కాంగ్రెసు నడిపిన రాజకీయ సమరములో స్త్రీలు ప్రముఖ పాత్ర నిర్వహించి, స్వాతంత్ర్య సముపార్జనాసక్తిని ప్రదర్శించి, భారత దేశజనకుడైన గాంధీ మహాత్ముని ప్రశంసలను చూరగొనిరి.

భారత జాతికి రాజకీయ స్వాతంత్ర్యము లభించి నాలుగేండ్ల యర్ధముగడచినది. అయినప్పటికిని ప్రజలకు సౌఖ్యవంతమైన జీవన ప్రతిపత్తిని ప్రసాదించు ఆర్థిక వ్యవస్థ నేటివరకు నెలకొల్పబడలేదు. సాంఘికముగా, పురుషులతో పాటు స్త్రీలు అనేక కష్టనష్టములకు గురియగుచున్నారు.

నేడు మనదేశములో సాంఘిక వ్యవస్థను పునర్నిర్మించుట ఆవశ్యకము. సంఘమునకు వ్యక్తికి సన్నిహిత సంబంధము నెలకొల్పుట ముఖ్యము. వ్యక్తి సంఘజీవి యగుటచే సాంఘిక విలువలను గుర్తించి బాధ్యతాయుతముగా ప్రవర్తించవలెను. సంఘమందు గల వివిధ జాతుల మధ్య సామరస్య భావముండవలెను. ప్రతివ్యక్తియు సంఘోపకారియగు కార్యములను సాధించి, పటిష్ఠమైన సాంఘిక యంత్రమును నిర్మించవలెను.

పురుషులవలె స్త్రీలును సంఘజీవులే యగుటచే, స్త్రీలు నిర్వర్తింప వలసిన బాధ్యతలును గలవు. సాంఘికమైన సేవచేయుటలో స్త్రీలును ముఖ్యముగా పాల్గొనవలసిన ఆవశ్యకత ఉన్నది.

పూర్వము మనదేశములో సౌష్ఠవమైన, సుస్థిరమైన ఆర్థిక వ్యవస్థ నెలకొని యుండుట చేతను, సాంఘికముగా స్త్రీలకు స్వాతంత్ర్యము లభించుట చేతను, వివిధరంగాలలో స్త్రీలు కృషి చేసి, దేశీయ సంపదను పెంపొందించెడి వారు. ఆ దినములలో నిత్యజీవితావసరములగు వివిధవస్తు పరికరములను స్త్రీలు స్వయముగా తయారు చేసెడివారు. సంఘము చిన్న చిన్న శాఖలుగవిడి, గృహోపకరణములు తయారు చేసెడిది. వ్యవసాయమందును, కుటీర పరిశ్రమలందును స్త్రీలు పురుషులు కలసి పనిచేసెడివారు. కాని యంత్రయుగ మారంభమైన నాటినుండియు పరిస్థితులు తారుమారయ్యెను. అంతకు పూర్వమున్న సాంఘిక వ్యవస్థ పూర్తిగ మారిపోయెను. చేతిపనులు, కుటీరపరిశ్రమలు, వీటియందు ప్రజల ఆదరాభిమానములు నశించెను. యంత్ర నిర్మితములైన గృహ పరికరములనే కొని, ప్రజలు చేతిపనులను ప్రోత్సహించుట మానివైచిరి. పురుషులు జీవనోపాధి కొరకు యంత్రపరిశ్రమలపై ఆధారపడి, కార్మికవృత్తిని స్వీకరించిరి. స్త్రీలు మాత్రము ఏవిధమైన ప్రోత్సాహము లేకుండుటచే, వృత్తిలో పాల్గొనుట మానివేసిరి. దీని ఫలితముగా స్త్రీలు సాంఘికముగా కొంత స్వాతంత్ర్యమును కూడ కోల్పోయిరి.

యంత్రపరిశ్రమల మూలముగా వృత్తి విద్యలు నశించినవి; పురుషుడు ధన సంపాదనకై కాయకష్టముపై నాధారపడుటయు, స్త్రీ తన స్వగృహాంగణమందే నిలిచి పోవుటయు సంభవించెను. అయినను తక్కువ తరగతి స్త్రీలు ఏదోయొక వృత్తిపై నాధారపడుట తప్పలేదు. గృహపరిశ్రమల ఆర్థిక విలువ సన్నగిలినది. దానితో కుటుంబ జీవనమునకు వలసిన ఆర్థికశక్తియు పోయినది. ఆ విధముగా సంఘములో స్త్రీలు తొలిసారిగా ఆర్థిక స్వాతంత్ర్యమును కోల్పోయిరి.

నేడు స్త్రీలు కుటీరపరిశ్రమలు ప్రారంభించవలెను. కాలమును వృథాచేయక వీలైనంతవరకు, స్వగృహోపయోగములగు వస్తుపరికరములను తయారు చేసికొనుట యుక్తముగ తోచుచున్నది. నేటి సంఘములో పురుషునివలె స్త్రీకి తగిన ఆర్థిక సంపాదన

చేయుట వీలుపడకుండుటచే కుటుంబపోషణ కష్టమగుచున్నది. స్త్రీలకు ఆర్థికముగాను, సాంఘికముగాను ప్రతిపత్తి తగ్గిపోయినది. సంఘములో వృత్తి ఉద్యోగములు గలిగి, పురుషులకు ఆర్థిక సంపాదనగలదు; కాని మధ్యతరగతి స్త్రీకి అట్టి రక్షణలేదు. స్త్రీ కేవలము పురుషునిపై ఆధారపడియున్నది. కాని స్త్రీలు కేవలము గృహాంతర జీవనమందే నిమగ్నమై యుండుట దేశమునకు శ్రేయస్సుగాదు. జీవిత శకటమున స్త్రీ పురుషు లిరువురూ రెండు చక్రాలు. సర్వతోముఖమైన సాంఘిక, రాజకీయ చైతన్యములను కల్పించుటలో స్త్రీలకు బాధ్యతగలదు. స్త్రీలకు కూడ నేటి సంఘములో వృత్తి ఉద్యోగములను కల్పించి, ఆర్థిక సుస్థిరత్వము నెలకొల్పుట వలన దేశము అద్యతన భావిలో పురోభివృద్ధి చెందగలదు. సంఘములో పురుషునివలె ఆమెకు సమాన స్వేచ్ఛ, ధనార్జనావకాశములుండవలెను.

మరియొక విషయమేమనగా, నేటి సంఘములో కార్మిక కర్షక తరగతులకు చెందిన స్త్రీలు కాయకష్టపడి ధనమార్జించుచుండ, మధ్య తరగతి స్త్రీలు అట్టి ఉద్యోగములు చేయుట గౌరవ లోపమని ఎంచుట. స్త్రీలు ఉత్సాహము చూపినను వారికి తగిన ప్రోత్సాహములేదు. సంఘములో ఇట్టి భేదములుండరాదు. స్త్రీలకు కూడ తగిన రక్షణ ఉండవలెను. కనుక స్త్రీ స్వాతంత్ర్యమును అందరూ గుర్తించినచో సంఘము త్వరలో బాగుపడగలదు.

నేటి సంఘములో మధ్యతరగతి స్త్రీలు కొన్ని వైవాహిక సూత్రములకు కట్టుబడి ఆదర్శ జీవితమును గడుపుచున్నారు. వృత్తి విషయకముగాను, విద్యా విషయికముగాను, కళా విషయికముగాను, వీరికి జీవితము గడుపు అవకాశములేదు. మన దేశములో సమష్టి కుటుంబములో స్త్రీలు ఉద్యోగము చేయ నవసరమును లేదు. కుటుంబ పోషణకువలయు ధన సంపాదనము చేయుట పూర్తిగా పురుషులదే యగుటచే, కుటుంబములోని ఆర్థికపరిస్థితులు అసంతృప్తికరముగా పరిణమించుచున్నవి.

మన దేశములో స్త్రీలు కొంతమంది విద్యాభ్యాసానంతరము వీరు వైవాహిక జీవనములోనే ఉండి, సంఘోప యుక్తమగు నెట్టి కార్యములను చేయుటలేదు. వీరు అభ్యసించిన విద్యయునట్టిదే. నేటి విద్యా విధానములో స్త్రీలకు కుట్టుపనులు, చేతి పరిశ్రమలు, గృహశాస్త్ర విషయములు నేర్చుకొనుటకు అవకాశమేలేదు. ఇట్టి అసంపూర్ణమైన విద్యావ్యాప్తి ఫలితముగా స్త్రీలు సమాజికముగా అసంతృప్తి కరమైన జీవితములను గడుపుచున్నారు. జీవితములో సయుఃత్పన్నమగు నెట్టి సమస్యలను పరిష్కరించుటకు తగిన విజ్ఞానముగాని, సహనముగాని, పురుషుల కష్టసుఖముల పంచుకొని ఓర్పువహించుట గాని, నేటి స్త్రీలకు తెలియదు. కుటుంబ విషయములను సరిచూచుకొను శక్తిసామర్థ్యములైనను కొందరి స్త్రీలకు లోపించుచున్నవనుట అతిశయోక్తి కాదు. మన సంఘములో స్త్రీలు వృథాగా కాలము పుచ్చుచున్నారు. కళాత్మకముగా, వైజ్ఞానికముగా వారు పురోగమించుటలేదు. అందువలన స్త్రీలు నైతికముగాను, సాంఘికముగాను సోమరులగుచున్నారు.

స్త్రీల పురోభివృద్ధికి ప్రభుత్వము తగిన సహాయము కల్పించవలెను. స్త్రీలకువృత్తి ఉద్యోగములనిచ్చి, ఆర్థికముగాను, సాంఘికముగాను తగిన రక్షణ ఈయవలెను. స్వీడెన్ వంటి దేశాలలో ఏర్పాటు చేయబడిన "సహకార గృహనిర్మాణ ప్రణాళికలను" అమలు చేయుట మంచిది. నర్సరీ విద్యాలయములు నెలకొల్పి విజ్ఞాన ప్రబోధము చేయవలెను. స్త్రీలు సంతానవతులైనపుడు తమ సంతానమునకు క్రమశిక్షణ నిచ్చి, ఆరోగ్యకరమగు నభ్యాసములను నెలకొల్పు సామర్థ్యము అలవర్చుకొనవలెను. పాశ్చాత్య దేశములో కుటుంబ పోషణము, జీవనము, క్రమశిక్షణపై నాధారపడియున్నవి. అచటి యువతులకు, గృహ జీవనవిధానము నేర్పబడుచున్నది.

సాంఘికమైన మార్పులను చేసి స్త్రీలు వివిధ రంగాలలో కృషిచేయుటకు అవకాశము కల్పించిననాడు, దేశము సర్వతోముఖముగా పురోభివృద్ధి చెందగలదు

——(o)——

# ప్రేమ ఫలితం

శ్రీమతి కర్రి కమలాదేవి

[అది వేసవి పున్నమ రేయి. వెన్నెట్లో సీత తన వినీల కుంతలాన్ని సవరించుకుంటూ సిందూర తిలకాన్ని మాటి మాటికి దిద్దుకుంటూ ఎవరి కొరకో నిరీక్షిస్తున్నది. ఆలస్యమయిన కొలది తన శృంగారము చెదరి పోవునేమో యని బాధపడుతోంది పదమూడేండ్ల బాలిక సీత. ఆ సన్నని సరిగంచు నీలి చీరెలో నుండి ఆమె సౌందర్యము పొంగి పొరలి పోవుచున్నది. ప్రతీక్షణం వెను తిరిగి చూస్తుంది; పాపం... ఎవ్వరూ లేందే! ఎంతసేపని : నిరీక్షణ ? ఎంతబాధ? ఇక లోనికి పోనున్న సమయంలో బావ ఈల పాడుతూ వచ్చాడు. "సీతా! ఈరాత్రి సమయంలో ఈ తోటలో ఎందుకు కూర్చున్నావు? పద లోనికిపద" అన్నాడు బావ. "అబ్బ గట్టిగ కేకలెయ్యకునీకోసమే కూర్చున్నాను. ఇంతసేపు ఎక్కడున్నావు?"

బావ:-నా బాధ నీకేం తెలుసునమ్మా? రోజంతా కష్టపడితే చాలక రాత్రికూడ పనిచేయమంటాడు మా దొర.

సీ:-ఆ పని మానెయ్యమని నేనెన్నో సార్లు చెప్పేను వినవు గదూ ... ?

బా:-సరేలే నీకేం తెలుసును? ఇందాక కేకలెయ్యకన్నా వెందుకూ ? ...

సీ:-పెళ్ళయిందగ్గర నుంచీ మా నాన్నగారు నీతో మాట్లాడవద్దన్నారు. బావా! మాట్లాడితేనేం? అందుకనే దొంగతనంగా ఈ చీకట్లో నక్కి నీ కోసం చూస్తున్నాను.

వాసుబావముఖం ఎర్రబడింది. ఒక నిట్టూర్పే దానికి జవాబు. నెమ్మదిగాముఖం క్రిందకు దించుకున్నాడు.

సీత:-"ఏం బావా! నీకు కోపం వచ్చిందా ఎందుకూ? నాన్న వద్దన్నా నేను మాటాడతానుగ" అంటూ సీత బావ బుజంమీద చెయ్యి వేసింది"

బా:- అదిగో చూడు నన్ను ముట్టుకోకు మామచూస్తే నన్నింట్లోంచి తరిమేస్తాడు. సరేగాని మీ అత్తవారింటికి ఎప్పుడు వెళతావు?

సీ:-మా అత్తవారిల్లంటే నాకిష్టం లేదు. అక్కడ నీలాగ నాతో ఎవరు మాట్లాడుతారు ?

బా: తప్పు, సీతా! -అలా అనకూడదు. నీ పెళ్ళికొడుకున్నాడుగదూ ! అతనే మాట్లాడుతాడు.

సీ.:బావ! నామాట నమ్మవు గాని, ఆ అబ్బాయంటే నాకేం సరదా లేదు. పెళ్ళిలోకూడా నువ్వే పల్లకీలో వుంటే బాగుండు ననుకున్నాను. మా అమ్మతో అంటే నా బుగ్గలు నులిమేసి "ఆ దరిద్రుడెక్కడ దొరికేడే నీకు; నిక్షేపంలాగ భాగ్యవంతుణ్ణి కట్టుకుంటూన్నావని సంతోషం లేదు" అన్నది. అప్పటినుంచి మరీ నీపేరెత్తలేదు.

వాసు:-నీకేమీ తెలీదు సీతా! నాకు ధనంలేదనే, వరుస అయినా మామామ నాకు నిన్నియ్యలేదు. ఒక్కగాను ఒక్క కూతురువుకదా? భాగ్యవంతునకిచ్చి సుఖిస్తే చూడాలని వారి ఆశ

సీ:.అదిగో అమ్మ పిలుస్తున్నది, భోజనానికి పోవాలి. నువ్వుకూడ పద అంటూ ఒక్క గెంతులో పారిపోయింది సీత.

వాసుదేవరావు సీత మేనత్త కొడుకు. వయస్సిరువది నాలుగేండ్లుండవచ్చును. B. A. ప్యాసయికూడ చిన్న వుద్యోగం జేస్తున్నాడు. చెంపకు,చేరెడు కండ్లు కన్నెత్తితే కనకాభిషేకం, మృదువైన స్వభావం, సరసమయిన హృదయము. సర్వాంగ సౌందర్యవతి సీత వలచిందంటే వింతేమిటి? చిన్ననాటి స్నేహంకూడ. మరునాడదే సమయానికి మరల అలంకరించుకొని తయారయింది. తన అలంకారాలు వాసు చూస్తేనే సార్థక మనుకుంటుంది. సిగరెట్టు పీలుస్తూ కండువా విసురుకుంటూ చిరునవ్వుతో వాసు ప్రత్యక్షమయాడు. సీతకింకేంకావాలి. "ఎందుకింతాలస్యం చేసేవుబావా ?" అంది.

"నువ్వింక మరచిపోవు కాబోలు, ఎంతచెప్పినా వినవు కదా..."? అన్నాడేగాని వాసుకి మాత్రం

ఇష్టంలేదూ? గాని ఏంచేస్తాడు. మామ చేసిన ద్రోహాన్ని, తన కర్మమనుకొని అనుభవించాలని ఆయన తలంపు. ఎట్లయినా సీతను తనను మరచి హాయిగా వుండమంటాడు, లేకుంటే చాలా బాధలున్నాయని అతనికి తెలుసును. అమాయక హృదయ బాలికయయిన సీతకేం తెలుసు?

నిత్యం ఇంటిముందు చిన్నతోటలో శృంగారించుకొని బావతో ఆడుకోవాలనుకొంటుంది. "చూడూ బావా ఈరోజు ఇంట్లో ఎవ్వరూ లేరు. నాన్న కేమాను వెళ్ళేరు. అమ్మ వాళ్ళ ఇంటికి వెళ్ళింది. మన ఇష్టం వచ్చినంత సేపు మాట్లాడుకో వచ్చును, ఎవరూ ఏమీ అనరు. నువ్వెప్పుడూ మాసిన గుడ్డలు కట్టుకుంటావేం, మంచి బట్టలుకట్టుకొంటే ఇంకా ఎంతో బాగుంటావు, నువు ఇపుడేం కట్టుకున్నా నాకిష్టమే గాని అందరూ నిన్ను బీదవారంటారు అలా అంటే నాకెంతో కష్టంగా వుంటుంది. నీకు డబ్బులేక పోతే నాన్నకు తెలీకుండా నీకిచ్చేస్తాను లే. తీసుకుంటావా? అన్నది సీత.

ఆమె అపారమైన ప్రేమకు అతని మనసు కరగి నీరయింది. కండ్లు నీటితో నిండిపోయినవి. అతని వుత్తరీయంతో సీత కళ్ళుతుడిచింది.

సీ:. ఎందుకూ ఏడుస్తావు. బీదవాడవనా? చూడు నా దగ్గర ఎన్ని బంగారు గాజులున్నవో, ఇవన్నీ నీవు తీసుకో, నేను తొడుగుకునే కన్న నీవు తీసుకుంటే నాకెంతో ఇష్టం అన్నది.

బా:- నేను బీదవాడినని నాకేం విచారంలేదు. మన ప్రేమ నిలా పెంచి తరువాత మీ అత్తవారింట్లో చాలా దుఃఖపడుతావు. నీవు వెళ్ళిపోతే నేనెంత బాధపడాలో కదా అని?

సీ:- అస్తమానం అత్తవారిల్లంటావు నే నక్కడకు వెళ్ళనే వెళ్ళను.

బా: మరేం చేస్తావు?

సీ:- నీతోనే వుంటాను.

బా:- మరి మీ నాన్న నిన్నేం చేస్తాడో తెలుసా?

సీ:- నీవు చూస్తూ వూరుకుంటావా!

బా:- ఏం చేయగలను?

సీ:- మీ వూరు పోదాం, పద.

బా:- మీ వాళ్ళను విడచి వస్తావా?

సీ:- నువ్వుంటే నాకెవ్వరూ అక్కరలేదు.

కొంచెం రోజులలో సీత అత్తవారింటికి వెళ్ళిపోయింది. ఇష్టంలేనప్పుడన్నీ కష్టమే, రోజూ బావను తలచి ఏడుస్తుంది, ఆమెకు దినమొక యుగంలావుంది.

వాసుదేవరావు సీత వెళ్ళిన తరువాత ఆ యూరిలో నుండలేక ఆ వుద్యోగం వదలి, చెన్నపట్నం వెళ్లి దొరతనం వారి స్కాలరుషిపు - సంపాదించి డాక్టరీచదివి పెద్ద డాక్టరయేడు.

పురుషహృదయంకదా! చాలా కర్కశమయినది. సీతమీద ఎంతప్రేమవున్నా ఆమెవలె బెంగ పెట్టుకోలేదు. రోజులుగడిపేస్తున్నాడు సీత జ్ఞాపకంవుందో లేదో కూడ, ఒకనాడు సీత బావకిలా వుత్తరం వ్రాసింది.

"వాసుబావకి"

నీవు నన్ను మరచిపోయి నిర్విచారంగా నున్నావు, నేను మాత్రం నిన్ను మరవలేను. నాకిచ్చట ఏలోపములేదు సకల భోగములున్నవి ఎందుకూ? నీవు లేవుకదా! చిన్న తోటలో నీవన్న మాటలు నా కానాడు బోధపడేవి కావు ఇప్పుడవన్నీ జ్ఞాపకంవస్తున్నవి. ఆయనతో మాటాడుట కూడ నాకిష్టంలేదు ఆయన నవ్వితే నీవు నవ్వినట్లుండదు. మాటలైన చేతగావు. భోజనం నిద్ర రెండు తెలుసును. మా నాన్న నాకు శిక్షచేసేడు కాని పెండ్లి చేయలేదు. నా జీవితమెట్లు గడపగలనో తెలియదు, ఈ బ్రతుకుకన్న చావే సుఖమని తలస్తున్నాను. ఇలా జరుగుతుందని తెలిస్తే నిన్ను ప్రేమించక పోయి వుందును. నా మనసింత దృఢమైనదని ఎరుగను బావా, నీకు కొంచమైనా బాధ వుందా? మహారాజులా వున్నావు. అప్పుడు నీకు తెలిసేకూడ వూరకున్నావు, నా మీద కంటె నీమీదే నాకు ప్రేమ హెచ్చు, మా నాన్న దగ్గర నీకు భయం కొంచెమయినా ఆలోచించేవా? నీకేంలే ఇప్పుడైన జ్ఞాపకంవున్నాను గనుకా! నీకు జాబు వ్రాస్తే నా

కేమి లాభం? గాని కొంతసేపైన నీతో మాటాడి నట్లుంటుందనీ శాంతి కోసం వ్రాసేను, నవ్వితే నవ్వు.

నీ సీత

తరువాత సీతకిలా జవాబువచ్చినది

(నా సీతకు!) చిన్ననాటి పిచ్చి నీకింకా వదల లేదూ? పిచ్చి పిల్ల విచారించి మరింత బాధేకదూ, ఇంకెన్నడూ జాబులు వ్రాయకు; మీ ఆయనకు తెలిస్తే నిన్ను నన్ను కూడ చంపుతాడు, ఇంకెప్పుడూ వ్రాయకు నీవీ జన్మలో నా పేరైన తలపరాదు. సంఘం నిన్ను నన్ను చూచి నవ్వుతుంది. నీ బంధువులు నిన్ను గౌరవించరు.

నేను నిన్ను మరచిపోయేనా? మరువగలనా? వెర్రిదానా! నా ఆరాధనా దేవతవు నీవు. నేను పెండ్లి చేసుకోలేదు, చేసుకోనుకూడ. ఈ యూరిలో స్త్రీలకేంలోటూ! గాని, నాకంటి కెవ్వరూ నచ్చలేరు. నీ చిన్ని చేతులతో కనులు మూసిన రోజులు, అవ్యక్త మధురములైన మాటలు, నీ ఆటలు నేను మరువగలనా? గాని నేనేమియు చేయలేను. నేను నీకులేను మన ప్రేమను సంఘ పిశాచమునకు బలిఇచ్చి నన్ను మరచిపో సీతా, మరచిపో॥

నీ బావ.

సీత జాబు చూసుకొని ఏడవక ఏంచేస్తుంది? చేతకానప్పుడే ఏడుపు; ఎన్నో దినములు గడిచినవి, సంవత్సరములు గడిచిపోయేయి, కాలం గడచిన కొలదీ వయసు, దాంతో జ్ఞానం హెచ్చాయి హృదయం భారమయి పోతోంది. సీత చింతతో దహించి పోతోంది, ఎట్లో సంసారం గడుపుతోంది, శరీరం దుర్బలమయింది, ఎప్పుడూ జబ్బుగా వుంటుందిగాని జబ్బేమిటో తెలియదు. ఆయన చాలా డబ్బు ఖర్చుపెట్టి మందు లిప్పించేడు గాని కుదరలేదు. ఎప్పుడూ పండుకొనే యుంటుంది; నీరసముంటుంది మంచాని కంటుకుపోయింది. మంచి నీళ్లైనా త్రాగదు. సీత భర్త చాలా బెంగపెట్టు కున్నాడు. మదరాసు తీసుకు పొమ్మని అందరూ సలహా ఇచ్చేరు.

ఆ మరునాడు సీతతో ఆయన మదరాసు చేరినాడు, సీత నడువలేని స్థితిలోనుంది. ఆమెను చేతులతో ఎత్తి కారులో చేర్చేడు. వాయు వేగంతో కారుపోతోంది. జనరలాస్పటిల్ రోడ్డు పట్టింది బండి. ఇంతలో ఇంకొక కారు ఎదురుగా వస్తోంది. సీత కారును తప్పించలేకపోయేడు డ్రైవరు రెండు బండ్లు గుద్దుకొని ఆగిపోయినవి, సీత భర్త కూలి క్రిందపడ్డాడు సీతకు తెలివేలేదు రెండవ కారులోనున్న మనిషి ఇదంతాచూసి, అతనిని కారులో చేర్చి, హాస్పటిలంలో ఇద్దరినీ బెడ్ మీద చేర్చేడు.

మూడుదినములకు సరియైన స్థితికి వచ్చినది సీత. తెలివివచ్చినను వైద్యులామెను మాటాడనీయలేదు. ఆమె భర్తస్థితి నర్సు నడిగిందిగాని నర్సు జవాబీయలేదు. సమయానికామె కన్నివిధముల వుపచారములు జరిగిపోవుచున్నవిగాని ఆమెతో ఎవ్వరూ మాటాడలేదు.

పెద్దదొరగారి అనుమతి నామెకు వున్నతమైన సేవలు జరుగుచున్నవి.

మధ్యాహ్నం మూడుగంటలవేళ సీత నిద్రలేచి చూచేసరికి ఎదుట కుర్చీలో ఆ నాటి సూటుమనిషి కూర్చొనియున్నాడు. ఆమె అదే పనిగా ఆయన వైపు చూస్తున్నది. ఏదో మాటాడబోయి మాటాడలేకపోయి కంపించిపోయింది, తుదకు "బావా" అని భోరున ఏడుపు మొదలు పెట్టింది. వాసుదేవరావే అచ్చటి పెద్ద డాక్టరు. "భయపడకు సీతా నీకేమీ భయంలేదు, అసలే నీరసంగానున్నావు, మీసమాచారమంతా తెలసికొన్నాను, పాపము అభాగ్యుడు నీభర్తకూడ నిన్న చనిపోయినాడు, చాల పెద్దదెబ్బ తగిలింది" అన్నాడు. సీత ఈ ఘోరవార్త ఒక్కసారిగా విని తెలివి తప్పింది. వాసు వుపచారములు స్వంతంగా చేసేడు. సీతకు తెలివివచ్చిన తరువాత, "బావా! దిక్కులేనిదానినయి పోయేను. ఒంటిగా చిక్కుపడిపోయేను, మా నాన్న నీకు చేసిన ద్రోహం మరచిపోయి రక్షించవూ అంది" సీత. "నీబావ ఈ

నాడు ధనవంతుడైయున్నాడు. నేనెప్పుడూ ని వాడనే అన్నాడు" వాసు.

పది దినముల తరువాత సీతకు బాగా నయమయింది. హాస్పటిలునుంచి తన ఇంటికి తీసుకొని వెళ్ళినాడు వాసుదేవరావామెను. సాయంత్రం చల్లగాలిలో వారిద్దరు సంభాషిస్తున్నారు వాసు-సీతా. నీకు బాగా సుఖంగావుంది ఇక నీకు చికిత్స అవసరంలేదు. బలమునకై మందులు వ్రాసి ఇస్తాను. జాగ్రత్తగా విశ్రాంతితీసికొంటే నీకింకా బాగా నయమయిపోతుంది, రేపు నాకు సెలవు నిన్ను మాను ఇంట దిగబెట్టేస్తాను పద" అన్నాడు.

సీ:-బావా! నీకు అన్నియు తెలుసును, నీవు నన్ను పరీక్షిస్తున్నావా? మానాన్న నీకు చేసిన అన్యాయానికి నీవు నాముఖం చూడకూడదు. నీవు పెండ్లి చేసుకోలేదంటే నేను నమ్మలేదు. ఇంత భాగ్యవంతుడవు కట్నముతో కన్యనిచ్చెదరు. అయినను నీవంగీకరించలేదు. ప్రేమమూర్తివి, త్యాగమూర్తివి అంటే అతిశయంలేదు, నాన్న ఇంటికి నేను వెళ్ళినను నిన్నే ఆరాధిస్తాను, బాల్యానికి నాకు పెండ్లి అయింది నిజమేగాని, నేను మాత్రం పెండ్లాడలేదు. నేను బ్రహ్మచారిని; నమ్మితే నమ్ము. నిజంగా నేను వితంతువును కాను కన్యను, నా మనసు నా తనువు చిన్ననాటినుండియు నీకే అర్పణ చేశాను. దైవము ఈ నాటికి ఈ పరిస్థితులు కలుగజేసి అనుకూలుడయ్యేడు. నీవు నన్ను పెండ్లిచేసికోకున్న, నీకు దాసిగా వుంటాను. ఇప్పుడు నాకు నేనే అధికారిని.

వా:-సీతా! నీ వింతగా చెప్పనక్కరలేదు నేను నిన్ననుమానించలేదు. దైవమే మనకు వివాహం చేసేడు.

ఈ నాడు డాక్టరుగారి భార్య అయింది సీత. ఇంటి ముందు పెద్ద తోటలో శృంగారించుకొని మరల నిరీక్షిస్తున్నది బావకొరకు సీత. ఈల పాడుతూ బావ వచ్చేడు. తల్లో మల్లెపూలదండ సవరించుకుంటూ వెనుతిరిగిచూస్తే వాసు, "నీ పువ్వులు నేను బాగా సవరిస్తాను రా" అని చేతులు చాచేడు, ఆమె అతని చేతులలో వాలిపోయింది.

# చెట్టుమీది కొండడు



శ్రీ వి. బాస్కర్

కొండయ్యకు ఏడెనిమిది మంది పిల్లలు. తల్లి దండ్రులతో చేరి ఆయన కుటుంబంలో పన్నెండు మంది ఉన్నారు. తనకున్న రెండెక రాల పొలాన్ని కష్టపడి సాగుచేసి ఎంతో కష్టంమీద తన కుటుంబాన్ని ముందుకు తీసుక పోతున్నాడు.

ఆ ఏడు వర్షాలు సరిగా వర్షించక రైతు లంతా నాశన మయ్యారు. కొండయ్య కుటుంబం రోజుల తరబడి పస్తులుండి నానా అవస్థలూ పడింది. ఆపడే దుక్కిటెద్దుకు జాడ్యం తగిలి చచ్చిపోయింది. దాని జత గిత్త ముసలిదై పోవటంతో నలభై రూపాయ లకు కొండయ్య దాన్ని అమ్మేశాడు. ఆ ఎద్దులు పడిపోవటంతో కొండయ్యకు మూడు వందల రూపాయలు మునిగింది.

కరువు కాటకాలకు తోడు ఉన్న గిత్తలూ నాశనం కావటంచేత కొండయ్య కుటుంబం దిగాలు పడింది. పుట్టెడు జనం తినటానికి తిండి సంపాదించుకోవటానికి మార్గం గోచ రించక కొండయ్య క్రుంగి పోయాడు. కొన్ని రోజులకే దేవుడు చల్లని చూపు చూశాడు.

వర్షాలు కావలసినంత కంటే ఎక్కువ గానే పడ్డాయి. కాని మన కొండయ్య పొలందున్ని గింజలు విత్తటానికి ఎద్దుగొడ్లు లేవు. అందరూ వారి వారి భూముల్లో దున్నుకొంటున్నారు. కొండయ్య కేమీ అర్థంకాలేదు. ఇంట్లో డబ్బుల్లేకుండా ఎద్దు గిత్తల పట్టటానికి ఎలా కుదుర్తుంది?

ఎన్నో తంటాలుపడి ఓ ఆసామి వద్ద రూపాయికి నెలకు కానీ వడ్డీతో మూడు వందల రూపాయలు బాకీగా పుచ్చుకుని బయలు దేరాడు. అందరూ వారి వారి పనుల్లో ఉండటం వల్ల ఎద్దుల్ని పట్టటానికి తోడెవరూ లేకపోయారు కొండయ్యకు. ఎలాగైనా గిత్తల్ని తోలుక రాకపోతే సాగుచేయటం సాధ్యంకాదని డబ్బుల్ని మొలలో భద్రపరచి గిత్తలకోసం ఊరూరు చుట్టుకుంటూ వచ్చాడు. సాయంత్రానికి ఒకపల్లె చేరుకున్నాడు. అపట్టణానికి రెండు మైళ్లదూరంలో ఉంది.

చీకటి పడిపోయింది. కాబట్టి ఈరాత్రికి ఆవూళ్లోనే తల దాచుకుందామని వీధిని వెళ్తున్న ఒక పెద్దమనిషి పడుకోవటానికి కాస్త చోటిప్పించమని అడిగాడు కొండయ్య. ఆపెద్దమనిషి కొండయ్య సంగతంతా అడిగి తెలుసుకున్నాడు. కొండయ్య దగ్గర గిత్తల కోసం డబ్బు ఉంటుందని ఊహించు కున్నా డాయన.

ఆపెద్దమనిషి 'ఫరవాలేదు మాయింటి దగ్గరే పడుకుందురుగాని రమ్మ'ని కొండ య్యను తీసికెళ్ళాడు. బయట వరండాలో మంచం మీద పడుకోమని కొండయ్యకు

తెలిపి ఇంట్లోకెళ్ళి ఎవరితోనో అరగంటసేపు గుస గుసలు జరిపి బయటికొచ్చాడు.

"కమలా! ఈయన పడుకున్నాడిక్కడ. ఇంటిదగ్గఱ జాగ్రత్తగా ఉండండి. ఇప్పుడే వస్తానని" వెళ్ళిపోయి మరలా అర్థగంట కల్లా మరోవ్యక్తితో ఇంటికొచ్చాడు.

"మేం ఇంట్లో పడుకొంటాం. మీరిక్కడే భద్రంగా పడుకుంటారుగదూ...?" అని ప్రశ్నించాడు కొండయ్యను. "సరేనండీ! అలాగే పడుకోండి మీరు. నాకేం ఫరవాలేదని" కొండయ్య అన్నాడు.

వారిద్దరూ ఇంట్లోకెళ్ళి గడియ బిగించుకొని పడుకొన్నారు. మన కొండయ్యకు మనస్సును ఎంతచిక్క బట్టుకున్నా నిదుర రాలేదు. తన చేతనున్న డబ్బుల్ని దోచుకోవటానికి ఎవ రేం జేస్తారో యన్న భయంతో కదలకుండా పడుకున్నాడు. చీమ చిటుక్కు మన్నా ఉలిక్కి పడేవాడు.

సుమారు తొమ్మిది పదిగంటల రాత్రి కల్లా ఇంట్లో ఎదో తవ్వుతున్నట్లు శబ్దం వినిపించింది. కొండయ్యకు గుండెలు జోరుగా కొట్టుకో సాగాయి. చెవులు దిక్కించి కవాటపు రంధ్రాల్లోంచి వచ్చే శబ్దాన్ని వింటున్నాడు. కొండయ్య లోపలినుండి అస్పష్టంగా మాటలు వినిపించాయి. బాగా చెవియొగ్గి ఆలకించాడు. "ఇం...కా...రాత్రి...వెనుక ...చంపితే...ఇప్పుడు మేల్కొని..."

కొండయ్య దేహం కంపించి పోయింది. తల దిమ్మెక్కి పోయినట్లైంది. ముందు కెళ్ళటానికి అడుగు సాగటం లేదు. ఇక ఒక్క సెకెండు అక్కడ నిలువటానికి గూడా సాధ్యం కాలేదు కొండయ్యకు. తడబడ్తూ మంచం దగ్గరకెళ్ళి దుప్పటి భుజానేసుకొని తిన్నగా చీకట్లో తడవుకుంటూ ప్రక్కనే యున్న రోడ్డుచేరుకున్నాడు.

దూరంగా వెళ్ళటానికిగాని, అక్కడే నిలువటానికిగాని ధైర్యం చాలక పోయింది కొండయ్యకు. ఇంతలో ఆ త్రోవన ఎవరో వస్తునట్లు గుర్తుపట్టి ప్రక్కనే యున్న చింత చెట్టెక్కేశాడు చప్పుడు గాకుండా. చెట్టు కొమ్మల మీద ఆతడు నిలువ లేనంతగా వణికి పోతున్నాడు.

కొంత సేపటికి ఎవరో ఒకవ్యక్తి తానున్న ఇంటివేపుకే వెళ్ళటం గమనించాడు. కొండయ్యకు చెట్టుమీద నుండి అంతా అగుపిస్తున్నది. ఆవ్యక్తి తాను పరున్న మంచం మీదనే పడుకొన్నాడు. అంతటితో కొండయ్యకు కొంచెం శాంతి గలిగింది. కృష్ణ పక్షమైనందువల్ల చంద్రుడు ఉదయించాడు మరి కొంత సేపటికి.

తన మంచం దగ్గఱ ఎవరో పరున్న వ్యక్తిని ఏమో చేయుచున్నట్లగుపించింది. మరి కొంత సేపట్లో అక్కడికెవరో దీపంపట్టుకొచ్చారు.

వెలుతుర్లో 'మాబావే!' అని కేక వినిపించటంతో రపీమని శబ్దం, వెలుతురు లేక పోవటం జరిగింది. కొండయ్యకు శరీరం గజగజలాడి పోయింది. తాననుకొని ఆ పడుకున్న వ్యక్తిని యింటి ఆసామీ చంపేశాడని

అర్థం జేసుకున్నాడు. తన ప్రాణాలు మాత్రం దక్కగలవా యన్న అధైర్యంతో స్తబ్ధుడై పోయాడు చెట్టుమీది కొండయ్య. మరలా ఆ ఇంట్లో ఏడ్పులు సన్నగా విన బడ్డాయి. తెల్లవారు ఝామున్నే ఇంటి ఆసామీ, కూతుర్ను కాను దిక్కుగా వెళ్ళిపోవటం చూశాడు.

చెట్టుమీదనే కొండయ్యకు ఏడు గంట లైంది. దిగటానికి ధైర్యం చాలక అలాగే ఉన్నాడు వణకిపోతూ కొండయ్య. ఆ రాస్తాలో మోటారు వస్తుండటం గమనించి కొండయ్య గట్టిగా అరచేశాడు. ప్రయాణీకులా మనిషి స్థితి కనుక్కోవటానికి బస్సు నిలిపి దిగి రమ్మని ఎంత బ్రతిమాలినా, ధైర్యం చెప్పినా బస్సులోని వారంతా దిగి చెట్టు క్రిందికివస్తే దిగుతాననిపట్టు బట్టాడు.

అలాగే అందరూ దిగి కొండయ్యను దించుకొని సంగతి నడిగారు. జరిగిందంతా చెప్పేశాడు. కొండయ్య వెంటనే పోలీస్ స్టేషన్లో రిపోర్టుచేసి శవంతోపాటు తండ్రీ కూతుళ్ళను రిజిస్ట్రార్ ఆఫీస్ దగ్గర అరెస్టు చేశారు రక్షక భటులు.

కొండయ్యను చంపదలచి అతడు పడక నుండి లేచిపోయి ఆయింటి అల్లుడు సినిమా కెళ్ళివచ్చి పడుకోవటంతో అతని మామ గారే చంపినట్లు, కూతురు గోలచేయ టంతో శవాన్ని ఇంట్లో నే త్రవ్విన గుంటలో పూడ్చేసి కూతుర్ని సమాధాన పరచటానికి తన ఆస్తి పాస్తుల్ని ఆమెకిచ్చి వేయటానికి రిజిస్ట్రార్ దగ్గర కెళ్ళాడని మరలా తెలసింది.

# తల్లికోసం

మండువేసవి. ఎండ తీక్షణంగావుంది. దుర్మార్గునకు మాయావితోడైనట్లు, ఎండకు తోడు వడగూడ బాగా వీస్తోంది. టైము సుమారు ఒంటిగంటవుతుంది.

ధనికులు తమతమ సౌధాలలో నిద్రాదేవి యాహ్వానముల నందుకొంటున్నారు. బీదలు తిన తిండియు, విశ్రమించుటకు స్థానములేక, ఆ యెండలో అల్లాడుతున్నారు. పాపం నిర్భాగ్యజీవులు.

అట్టి సమయములో నొక పదేండ్ల బాలుడు-చింకిగుడ్డలతో; చేతిలో చిన్నగిన్నెతో పట్టెడన్నం కోసం తిరుగుతున్నాడు యింటింటికి. తన పొట్ట కొరకుగాదు; తనను కని, పెంచిన తల్లికోసం. వృద్ధురాలై, నడువ శక్తి లేని తల్లికోసం. కళ్లల్లో, దీనత్వం తొంగిచూస్తోంది. ఆ దీనపూరితమైన చూపులు గూడ, ధనవంతుల హృదయాలను కలచలేక పోయినవేమో, వానికి గుప్పెడు మెతుకులు దొరకలేదు.

"బాబూ! పట్టెడు మెతుకులు" పిల్లవాని కేక. "పోరా, వేళగాని వేళ!" యజమాని జవాబు. ప్రతి యింట, యిదేజవాబు. పాపమా బాలుని కాళ్లలో పటుత్వం తగ్గుతున్నది. చెమట కాల్వలు గట్టుతోంది. అతని హృదయము నిరాశను చాటునిస్తోంది. ఇంకా నడుస్తూనే వున్నాడు. ప్రతియింటికి వెళ్తూనే వున్నాడు. చివరికొక పూరిగుడిశ జేరి, ఆ యిల్లాలిని గుప్పెడన్నము పెట్టుమని ప్రార్థించాడు.

పేదవారికి హృదయ ముందేమో - ఆమె యా బాలుని స్థితికి జాలిపడి, రెండు రొట్టెల నిచ్చింది. ఆ బాలుడు వాటిని దీసికొని వడివడిగా నడుస్తున్నాడు, తన తల్లి దగ్గరకు.

కాలము గడుస్తూనే వుంది. పిల్లవాని దేహములోని బలమంతకంతకు క్షీణిస్తూనేవుంది. కాని ఆ రొట్టెలో పీసమైనను తాను దీసికొనలేదు. ఆ స్థితిలో నడిచి, నడిచి రోడ్డుమీద స్పృహలేక పడిపోయాడా బాలుడు. అంతే మరి లేవలేదు. రొట్టెలను తన తల్లికివ్వలేదు. మృత్యుదేవి యొడిలో దీర్ఘనిద్ర పోబోయాడా బాలుడు.

దయా రహితమైన యీ బాహ్యప్రపంచముతో సంబంధ మొదలకున్నాడు. తనకీ విషయముతో సంబంధము లేనట్లు గాలి వీస్తూనేవుంది. సూర్యుడు, తన తీక్షణకిరణములను ప్రపంచము మీదికి బంపుతునే యున్నాడు.

తల్లికోసం, తనప్రాణాన్ని త్యాగంజేసిన నిర్భాగ్యజీవి. దేశంలో యిట్టి త్యాగశీలురు, ప్రేమమయజీవులు, అనేకమంది యుండవచ్చు. దేశంలోనేగాదు, ప్రపంచములో కాని వారందరుకూడ ధనములేమిచే గుర్తించ బడరు.

# సామెతలు

శ్రీమతి పెనుమర్తి శేషమాంబా

1. కర్ణుడులేని భారతము హనుమంతుడు లేని రామాయణమూ రసవంతముగా నుండనట్లు.
2. విపరీతపు కాకులు, విడ్డూరపు పాటేసు అర్థరాత్రి వేళ అరుస్తున్నారన్నట్లు
3. కాకులరచినప్పుడు లేచి కాకరకాయలకూర చేసి, కాలేకాలే అన్నంవండి ఆదరబాదరా అస్తమానపు వేళకు అయ్యనకు వడ్డించానన్నట్లు.
4. ఆట్లు వండ చేరని అత్తముందర గారెలు వండ చేరనికోడలు మహామేధావియట.
5. త్రట్లూరు పాళ్లు దెబ్బలు మూడు పాళ్లట
6. పాటిమీది జేవతకు కూటి మీదనే మనసట.
7. కోటప్పకొండ తిరుణాలకెడితే యెక్కనూ దిగనేగాని మొక్కనే తీరలేదట
8. గిరుడు గూడందితే యీ ఏడు గూటికి పీట వెయ్యవలసినట్లున్నది.
9. దుస్నే వేళ చూడలలోను, మేసే వేళ యెద్దుల లోను.
10. తల్లిచస్తే కడుపుపెద్దా, తలమాస్తే ముడి పెద్దా
11. కూటికి పేదరైన కులమునకు పేదా?
12. మలరాజుగారింటికి మనుమడగ బోతే, మరొక చంపనవాయించారట
13. మలరాజుగారింట భోజనము, మాణిక్య రాజుగారింట పడకానట
14. నీవు పాడినందుకు నేను విన్నందుకూ సరి పోయింది; తలవూపిన దండగకు తాంబురా చిరతలక్కడ పెట్టి చక్కాపొమ్మన్నారట.
15. తల్లిని బోలిన బిడ్డా నూలును బోలిన గుడ్డా
16. కాల్లులోని ప్రత్తి కాయలోనుండగానే కాముడికి మూడు మూళ్లు నాకారమూళ్లనన్నదట
17. నేను చావాలేదు, అమ్మ యేడవాలేదు.
18. చక్కని ఆడది చిక్కినా అందమే, సన్నగుడ్డ మాసినా అందమేనట.
19. భీమికి తేలు కుడితే భీమవరము మారు మ్రోగిందట.
20. అత్తలేని కోడలు వుత్తమురాలు, కోడలు లేనత్త గుణవంతురాలు.
21. అత్తంత కోడలు యిల్లంత పందిరీనట
22. అచ్చి పెళ్లి బుచ్చిచావు కొచ్చినట్లున్నది.
23. కడవంత గుమ్మడికాయా కత్తిపీటకు లోకువట.
24. కరవబోయి ముంతలో దూరిందట.
25. భక్తిలేని పూజ పత్రికి చేటు, మంత్రమురాని సంధ్యమడుగికి చేటు




శ్రీమతి వల్లభనేని రంగాదేవి

(గతసంచిక తరువాయి)

(కిరణ్ ప్రవేశించును)

కిరణ్:-కాళీమాతను నరబలితో గాదు పూజించునది; ఆత్మబలితో పూజించాలి. (ఆలోచించి) సైనికులారా; మహారాణి మీకు తోడ్పడజాలదనుకుంటాను. మీరు ఆమె యాజ్ఞల పాలించనంతవరకు, మీరంతా కలసి కట్టుగా వుండనంతకాలం, హిందూ మహమ్మదీయులు ఐకమత్యంగా మెలగనంతవరకు - విజయం లభించుటకల్ల. ఆంగ్లేయులు ఝాన్సీపై ఆక్రమణ జరిపినప్పుడు మీరంతా ప్రాణాలు దక్కించుకునేందుకు పారిపోతారు. అప్పుడు యుద్ధం చేయడం అసంభవమగును.

అందరూ:-మేమంతా మహారాణి ఆజ్ఞల శిరసా పాలిస్తాం. విదేశీయులను చొరనీయం. అందరమూ యేకమై ఝాన్సీకై బలియై పోతాం. జై మహారాణి లక్ష్మీబాయికీ జై.

(రాణి ప్రవేశించును)

రాణి:-కల్పిత పరాక్రమ గప్పాలు కొట్టకుడు. మీరు పరాక్రమవంతులవలె ప్రాణాలపై మమత విడనాడాలి. మోహము, మమత, భయము మొదలగు వాటిని త్యజించాలి. పరాక్రమవంతుల లక్షణాలివి. అన్ని విధములైన కష్టాలు సహించాలి. మీలో యెందరు మృత్యువు నెదిరించ సిద్ధమైయున్నారో నాకు తెలియాలి. స్వాతంత్ర్యపూజ జేయునది ఫలపుష్పాదులతోగాదు; కబుర్లతోనూగాదు. అందుకు కావలసింది వేడివేడి రక్తం. అట్టి రక్తాన్ని మీలో యెందరు సమర్పించడానికి సిద్ధమైవున్నారో వినాలని వుందినాకు. వీరత్వాన్ని ప్రదర్శించేది మాటలతోగాదు - చేతలతో. పరాక్రమవంతులై ప్రాణాలర్పించడానికెందరు సిద్ధమైవున్నారో చూడాలని వుంది. మీలో పరాక్రమమేవుంటే,

ప్రాణాలర్పించి పంచభూతాల్లో కలసిపోవాలన్న భావమేవుంటే, యిప్పుడీ విధంగా, విదేశాలనుండి వాణిజ్యానికై వచ్చిన వర్తకులు భారతదేశంలో పరిపాలనా చక్రాన్ని పట్టుకుని త్రిప్పగలుగుదురా? వ్యాపారం జేసుకుంటాం, అనుజ్ఞ యివ్వవలసిందని అర్థించిన భిక్షుకులు, మనలను మనరాజ్యాన్నుండి దూరంజేసి, మనలను భిక్షుకులుగా తయారు చేయగలుగుదురా? సింహపు గుహలో నక్క బూకరించగలదా? మీమాటలు నేను విశ్వసించజాలను. మీరెప్పుడూ - ఝాన్సీ కొరకు ప్రాణాలర్పించ సిద్ధమై వుంటేమాత్రం నేను మీతో సహకరించి మీతోనే వుంటాను. లేకుంటే పొండి ... సైనిక దుస్తులువిడచి చీరలుదాల్చి గాజులు తొడుక్కోండి. ఝాన్సీరాజ్యాన్ని వీడి పారిపొండు - లేకుంటే శత్రుసైన్యాలు మిమ్ము సంహరిస్తై. నేను పిరికిపందలకు రాణినై.. భయగ్రస్తులకు మాతనై - సమరరంగమున సంచరించ జాలను. వీరుడగు సైనికు డొక్కడున్నప్పటికీ అతనితోపాటు ఆంగ్లేయుల నెదిరించి పోరాడి సంతసించెద. లక్ష్మీబాయి వీరులకు మాత - భీరులకు తల్లి గాజాలదు.

అందరూ:-తల్లీ! యీ క్షణముననే గద్దెపై కూర్చుండి ఆజ్ఞనిమ్ము; మేమాంగ్ల సైన్యాల ముట్టడింతుము. చివరి నెత్తురు బొట్టు చిందువరకును మాతృస్తన్యానికి మచ్చ చేకూర్చము. దేశమునుంచి ఆంగ్లేయులను ఖాళీ చేయిస్తాం, మాకు ప్రాణభయం లేశమాత్రమేని లేదు. చచ్చువరకూ సమర మొనర్తుము.

రాణి:-అట్లైన - యెల్లవేళలా తమ సేనాధ్యక్షుని యాజ్ఞల పాలింతుమనీ - వీరోచిత కృత్యాలు గావింతుమనీ - నీతిబాహ్య విషయాల విసర్జింతుమనీ - ప్రాణాల తృణప్రాయంగా భావించి యుద్ధరంగమున కురికి సైనిక ధర్మాల పాలింతుమనీ - ప్రతిజ్ఞ చేయండి.

అందరూ:-(ఒర్లనుండి కత్తులు లాగి) మేమీ కత్తులు చేబట్టి - ఝాన్సీ రాజ్యాన్ని - ఝాన్సీరాణి గౌరవాన్ని - రక్షించగలందులకుగాను, అంతిమ శ్వాస బీల్చువరకూ - ఆహవరంగమున విహరిస్తూ మహారాణి యాజ్ఞల పాలింతుమని - ప్రతిన బూనుచున్నాము.

రాణి:-బాగు బాగు (కత్తిలాగి) ఇప్పుడు మీకెల్లరకూ నాయకత్వం వహిస్తున్నాను. పాలనాభారం వహిస్తున్నానని ప్రకటిస్తున్నాను. నా యీకరవాలము - నాసర్వశక్తి - రాజ్యరక్షణకూ, ప్రజల.. సైన్యాల.. రక్షించ, యేమరుపాటెరుంగక యెల్లవేళల సిద్ధమై యుందును. సేనాపతీ!

కాలేఖాన్:-యేమాజ్ఞ మహారాణీ? కోట లోపల యీ భాగమందు శతృవుల శస్త్రాగారముంది. మరియు కొలదిమంది శతృవులున్నారు. వారు మనకు కష్టాలు కలిగిస్తున్నారు. అదికూడా హాత మార్చాలి.

రాణి:-అట్లైన ఫిరంగులు బారుచేయండి. ముట్టడించి శస్త్రాగారాన్ని వశపరచుకోండి. కోట యందొక బెత్తెడు భూమిలోకూడా శతృవాసన వుండరాదు.

[ఝాన్సీమహారాణీకీజై - జై జైనినాదాలతో పాటు ఫిరంగి కాల్పులు సాగును. కోటలోనికి సైన్య సమూహాలు జొరబడును.]

రాణి:-పరాక్రమవంతులగు సైనికులారా! మీపరాక్రమానికి తగు బహుమతులివ్వ... మీరాణి వద్ద సాహసము మినహా మరేమీ లేదని మీకెల్లరకూ తెలిసినట్టి విషయమేగద! అయినప్పటికీ... యివిగో నాదగ్గర కొలది యీభూషణములున్నవి. బహుమానంగా స్వీకరించండి. వీటిని స్వాతంత్ర్య సంగ్రామమున ఖర్చుపెట్టుకోండి. బైటనుండి వచ్చిన సైనికులు పురోగమించాలి. ఝాన్సీసైనికులు మాత్రం ఇక్కణ్ణే నిలబడి - రక్షణ - శాంతిస్థాపన... కార్యాలు కడు సమర్థులై నిర్వహించాలి.

(ఆభరణాలర్పించుట - సైనికులు జై జై నినాదముల - జీవజాలం దేవునిది - రాజ్యం వీరులది - పరమ పవిత్రం ఆనేది రాణీ లక్ష్మీబాయిది - అని అభినందలు జేస్తారు.)

(సశేషము)

# మానవుని దీర్ఘ జీవితానికై సోవియట్ శాస్త్రజ్ఞుల కృషి

వి. టిమకోవ్



ఎల్. పాస్ఛ్యూర్, ఐ. మెచినికోవ్, డి. సామొలోవిచ్, డి. జబొలొట్నీ, ఎన్. గమలేయా తదితర క్రిమిశాస్త్ర విజ్ఞాన పితామహులు మానవత్వపు ఉత్కృష్ట లక్ష్యాలతోనే తమకృషి సాగించేరు. అంటువ్యాధులను నిరోధించడానికీ, నిర్మూలించడానికీ మార్గాలను అన్వేషించడమే వారి ఏకైక లక్ష్యం. వారు యీ లక్ష్యసాధనకై తమ శక్తినీ, ఆరోగ్యాన్నీ ధారపోశారు ; తమ ప్రాణాలనుకూడా లక్ష్యపెట్టలేదు. వారిలో అనేకమంది ప్లేగు, కలరా వ్యాధుల నిరోధానికి ధైర్యంగా పాటుబడ్డారు. మరి కొందరు అంటు వ్యాధులకుగల కారణాలను, అవి వ్యాప్తిచెందే మార్గాలనూ తెలుసుకోవడానికి తమ ప్రాణాలనే అలక్ష్యంచేశారు. ఈ పనికోసమని వారు ప్లేగు, కలరా, విషజ్వరం తదితర వ్యాధి క్రిములను తమ శరీరాలలోకి ఎక్కించుకునేవారు.

శాస్త్ర విజ్ఞానంకోసం, మానవుని ఆరోగ్యంకోసం, దీర్ఘ జీవితంకోసం, స్వార్థరహితమైన సంఘ సేవ చెయ్యడంకోసం, జీవితాన్ని సయితం త్యాగం చెయ్యడానికి సంసిద్ధత, స్వదేశంపట్ల అత్యంత ప్రేమాభిమానాలు, ఇటువంటి ఉత్కృష్ట లక్షణాలు రష్యన్ క్రిమిశాస్త్రజ్ఞుల సొత్తు.

ఈ విధంగానే రష్యన్ అంటువ్యాధి శాస్త్రజ్ఞుడు క్రిమి విజ్ఞాన శాస్త్రజ్ఞుడు అయిన దానిలో సమొలోవిచ్ క్రిములను తన శరీరంలోనికి ఎక్కించుకుని పరిశోధనలుచేసి నియొమొనిక్ ప్లేగ్ వల్ల చనిపోయాడు.

వ్యాధి క్రిములను శరీరంలోనికి చొప్పించి తద్వారా రోగాన్ని నిరోధించే (ఉ॥ టీకాలపద్ధతి) సిద్ధాంతాన్ని కనుగొన్న ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు ఐ. మెచ్నికోవ్ కలరా వ్యాధియొక్క వ్యాప్తికీ, నిరోధానికీ సంబంధించిన సమస్యలను పరిష్కరించడానికి అనేకసార్లు కలరా క్రిములను తన శరీరంలోనికి ఎక్కించుకున్నాడు. ఇటువంటి పరిశోధనలే డి. జబలొట్నీ, ఐ. సావ్ షెంకోలుకూడా చేశారు.

తమ దేశంలోని అభ్యుదయ కాముకుల విశిష్ట సాంప్రదాయాలను అనుసరిస్తూ సోవియట్ క్రిమి శాస్త్రజ్ఞులు మానవకోటిని అంటు వ్యాధుల ప్రమాదంనుండి తప్పించడానికీ, మానవుని ఆయురారోగ్యాలను పెంపొందించడానికి తోడ్పడే సోవియట్ శాస్త్ర విజ్ఞాన విజయాలను సాధిస్తూనే వున్నారు.

సోవియట్ ప్రభుత్వం, అంటువ్యాధి శాస్త్రపరిశోధనాసంస్థలూ, క్రిమి శాస్త్ర పరిశోధనా సంస్థలూ, ఆరోగ్య సంస్థలూ తదితరమైన వాటిని అనేకం నెలకొల్పింది. ఈ సంస్థలలో పనిచేసే శాస్త్రజ్ఞులు అంటువ్యాధుల లక్షణాలను పరిశీలించి, వాటివ్యాప్తిని నిరోధించే శాస్త్రీయ మార్గాలను అన్వేషిస్తారు. అంతేకాకుండా టీకాలమందు, సీరమ్సలను తయారుచేసే కొత్త పద్ధతులను కనుగొనడానికీ వాటి గుణాన్ని ఎక్కువ చెయ్యడానికీ యీ పరిశోధనా సంస్థలలో విపరీతంగా కృషి జరుగుతూంది.

ఎన్. గమలెయా, ఎమ్. మొరొజొవ్, డి. జబలొట్నీ, ఎల్. తారాసెవిచ్, ఎమ్. సొలొవ్యోవ్, ఎన్. సెమస్కో, జడ్. సొలొవ్యాద్, ఎ. సిసిన్ తదితర శాస్త్రజ్ఞులు సాగించిన కృషిఫలితంగా అంటువ్యాధులను నిరోధించడానికి సహేతుకమైన శాస్త్రీయమైన పద్ధతులను తెలుసుకోడానికీ, మసూచి, ప్లేగ్, కలరా, విషజ్వరం తదితర వ్యాధులను నిర్మూలించడానికీ, పేగుల సంబంధమైన జ్వరం, డిఫ్తీరియా, ఆటాలమ్మ, స్కార్లెట్ ఫీవర్ తదితర వ్యాధులను బాగా తగ్గించడానికీ సాధ్యమయింది.

ప్రజల జీవన, సాంస్కృతిక ప్రమాణాలు బ్రహ్మాండంగా పెరగడంవల్లనూ, ద్వితీయ ప్రపంచ యుద్ధానికిముందు శాస్త్రవిజ్ఞాన పరిశోధన విపరీతంగా జరగడంవల్లనూ అంటు వ్యాధులను నిరోధించడంలోనూ నిర్మూలించడంలోనూ సోవియట్ దేశం

ఘనవిజయాలు సాధించింది. అయితే సోవియట్ క్రిమి శాస్త్రజ్ఞులు యింతటితో తృప్తిపడి వూరుకోలేదు అంటు వ్యాధుల నిరోధానికి వారు తీవ్రంగా పరిశోధనా కృషి సాగిస్తూనే వచ్చారు.

పి. డ్రడోవ్‌స్కీ, ఆతని సహచరులూ టిటానస్ వ్యాధిని నిరోధించే పద్ధతులమీదనూ, చికిత్సా పద్ధతులమీదనూ కృషి చేస్తున్నారు. ఎమ్. క్రోంటోవ్‌స్కాయా, ఎమ్. మాయవ్‌స్కీట విషజ్వరాన్ని నిరోధించే మందును తయారుచేసే పద్ధతిని కనిపెట్టేరు. పేగులకు సంబంధించిన అంటు వ్యాధులను నిరోధించే కొత్త పద్ధతులను కనుగొనడంలో చాల కృషి జరిగింది. ప్రొఫెసర్ అలెగ్జాండ్రోవ్, గెఫెన్‌లు సాగించిన పరిశోధనల ఫలితంగా పేగులకు సంబంధించిన అంటు వ్యాధులను నిరోధించడానికి ఒక కొత్తమందు (పోలీవేక్సీన్) కనిపెట్టడమైంది. ఏంత్రాక్స్ రోగ నిరోధానికి సజీవక్రిములనుండి ఒక మందు (వేక్సీన్) తయారుచేసే పద్ధతిని ఎన్. గిన్స్‌బర్గ్ కనిపెట్టేడు.

యుద్ధానంతర దశలోకూడా సోవియట్ క్రిమి శాస్త్రజ్ఞులు తమ పనిలో ఘనవిజయాలు సాధించేరు. ఎమ్. గెయిస్కీ రేబిట్ ఫీవర్ అనే అంటువ్యాధి నిరోధానికి మందు (వేక్సీన్) తయారుచేసే పద్ధతిని కనుగొన్నాడు.

ప్రొఫెసర్ డ్రడోవ్‌స్కీ, పి. వెర్షిలోవా తదితర శాస్త్రజ్ఞుల పరిశోధనల ఫలితంగా బ్రూసిలోసిస్ అనే రోగ నిరోధానికి మందు కనిపెట్టడం, వాడుకలో పెట్టడం జరిగింది. ఈ మందు వాడుకలోకి రావడంవల్ల యీ వ్యాధి చాలవరకు తగ్గిపోయింది.

నిమోనిక్ ప్లేగు చికిత్స చాలకాలం సమస్యగానే వుండేది. ఈ వ్యాధి సోకినవారు బ్రతకడం దుర్లభమయేది. ఎన్. జికోవ్ వెరిజ్నికోవ్ నాయకత్వాన సోవియట్ క్రిమి శాస్త్రజ్ఞులు యీ సమస్యా పరిష్కారానికి పూనుకుని విజయం సాధించేరు.

పి. సెర్జియేవ్ నాయకత్వాన సోవియట్ పరిశోధకులు మలేరియా వ్యాధి చికిత్సకు కొత్త పద్ధతులను అన్వేషించడంలో అనేక సంవత్సరాలు తీవ్రంగా కృషిచేశారు; చివరికి వారిరోగాన్ని నిరోధించడానికి కొన్ని మార్గాలను కనుగొన్నారు. వారి కృషి ఫలితంగా యీ వ్యాధి వ్యాపించడం చాలవరకు తగ్గిపోయింది. ప్రజా ఆరోగ్యశాఖలీనాడు మలేరియా వ్యాధిని పూర్తిగా నిర్మూలించడానికి ప్రయత్నం చేస్తున్నాయి.

అభివృద్ధి నిరోధక వీస్‌మాన్‌వాదం, మోర్గన్ వాదాలమీద అభ్యుదయకర మిచురిన్ జీవశాస్త్రం సాధించిన విజయం క్రిమి శాస్త్ర విజ్ఞాన పరిశోధనలో ప్రతిబింబించింది; ఇది సిద్ధాంతంలోనూ, ఆచరణలోనూ అనుకూల ఫలితాలకు దారితీసింది. వేక్సిన్‌లలోనూ, క్రిములతో తయారుచేసే యితర మందులలోనూ బాగా మార్పు వచ్చింది. మశూచి క్షయ వ్యాధుల నిరోధానికి మంచి వేక్సిన్‌లు తయారయాయి.

సూక్ష్మజీవుల మార్పుకి, ముఖ్యంగా క్రిముల స్వభావం, పైతృక లక్షణాలను మార్చడానికీ సంబంధించిన సమస్యలమీద ఎక్కువగా పరిశోధన జరుగుతూంది. ఈనాడు క్రిముల జాతులకు సంబంధించిన సమస్య పరిష్కరింపబడింది. ఒక క్రిమిజాతిని యింకొక జాతిలోకి మార్చవచ్చునని రుజువైంది. ఓ. లెపిషిన్‌స్కాయా పరిశోధనలు క్రిముల పెరుగుదలను, క్రిముల ఫిల్టరేటింగ్ స్వరూపాలూ, ఫిల్టరేటింగ్ విరుసస్‌కూ జీవకణ రహిత స్వరూపాలకూ మధ్యగల సంబంధాలను విశదీకరించేయి. క్రిములను మార్చివేయడం సాధ్యంకావడంవల్ల వేక్సిన్‌లూ, సీరమ్స్‌లను తయారు చేయడానికీ వాటిని పరిశ్రమల్లోనూ, వ్యవసాయంలోనూ వుపయోగించడానికి మంచి రకాల కొత్త క్రిములను సృష్టించడానికి అవకాశం కలిగింది.

సోవియట్ శాస్త్ర, విజ్ఞాన పరిషత్తు, సోవియట్ వైద్యశాస్త్ర పరిషత్తులు ఉమ్మడిగా జరిపిన సమావేశం క్రిమిశాస్త్ర విజ్ఞానానికి, ముఖ్యంగా అంటు వ్యాధి నిరోధ సిద్ధాంతానికి చాల ప్రయోజనకరమైంది. పావ్‌లోవ్ శరీర శాస్త్రరీత్యా అంటు

రోగ వ్యాప్తి శరీరంలో నిరోధక శక్తి ఏర్పడం కొత్త విధంగా జరుగుతుంది; రోగ నిరోధానికి సంబంధించిన భావాలుకూడా దానినిబట్టే మార్పు చెందేయి.

ఈ వ్యాసంలో సోవియట్ క్రిమి శాస్త్ర సాధించిన విజయాలు కొన్ని మాత్రమే పేర్కొనబడ్డాయి. అయితే, సోవియట్ క్రిమి శాస్త్రజ్ఞులు తమ కృషి అంతా అంటువ్యాధుల నిరోధానికి మాత్రమే సాగిస్తున్నారని పైవిషయాలు తెలియజేస్తాయి. ఈ కృషిలో వారు కమ్యూనిస్టుపార్టీ, ప్రభుత్వమూ, సోవియట్ ప్రజల సహకారాన్ని చూరగొన్నారు. అనేకమంది సోవియట్ క్రిమి శాస్త్రజ్ఞులకు స్టాలిన్ బహుమతులు లభించేయి.

సోవియట్ శాస్త్రజ్ఞుల పరిశోధనకు అనుకూల పరిస్థితులు సృష్టింపబడ్డాయి. ఈనాడు వివిధ అంటువ్యాధులను నిరోధించడానికి మాత్రమే కాకుండా, ప్రకృతిలో యీ వ్యాధి క్రిములనే పూర్తిగా తుడిచివేయడానికి అవసరమైనదంతా మావద్దవుంది.

"టాస్" నుండి

---

ఉద్యోగానికి వచ్చిన బాలుని యజమాని "ఏఅబ్బాయీ! నీకు ఉద్యోగం కావాలికదూ! నీవు ఎప్పుడైనా అబద్ధాలాడుతుంటావా?" యని అడిగాడు.

ఆ బాలుడు "లేదండి; కాని నేర్చుకోగలను" అని జబాబు చెప్పాడు.





## పొటమాటోకూర చేయువిధానము

సవాశేరు బంగాళాదుంపలు వుడకపెట్టవలెను. కొంచెము వుడికిన తరువాత వుప్పువేసి బాగా వుడకనిచ్చి, దించి తోలుతీసి చిన్నచిన్న ముక్కలుగా చిదిపి వుంచుకొనవలెను. ½ సవాశేరు పచ్చి టొమాటోలు సన్నముక్కలుగా తరిగి వుంచుకొనవలెను. 10 పచ్చిమిరపకాయలు దానికి సరిపోవు వుప్పు వేసి దంచివుంచుకొనవలెను. బాణలిలో ఒక గరిటెనూనివేసి పొయ్యిమీదపెట్టి కాగిన తర్వాత 5 ఎండు మిరపకాయల ముక్కలు, 1 స్పూను మినపప్పు, ½ స్పూను ఆవాలు కరివేపాకువేసి పోపుపెట్టవలెను. పోపులో తరిగివుంచిన టొమాటో ముక్కలువేసి కలియపెట్టి మూతపెట్టవలెను. వుడికిన తరువాత బంగాళా దుంపల ముక్కలువేసి బాగా కలపవలెను. దంచివుంచుకొన్న కారమువేసి కొంచెము సేపువుంచి దించుకొనవలెను.

## కరివేపాకు పచ్చడిచేయు విధానము

పావుసవాశేరు పచ్చికరివేపాకు బాగాకడిగి వుంచుకొనవలెను. బాణలిలో నెయ్యివేసి 4 తులములు ఎండుమిరపకాయలు, ఒక గరిటెడు మినపప్పు, కరివేపాకువేసి బాగా వేయించవలెను. 2 తులముల చింత పండు, దానికి సరిపోనువుప్పు, వేయించిన కరివేపాకులలో వేసి రుబ్బవలెను. (యిష్టమున్నవారు కొంచెము బెల్లము వేసుకొనవచ్చును) ఇది రోజూ తినిన ఆరోగ్యమునకు మంచిది. పైత్యహారి.

## పెసరపిండి జంతికలు చేయువిధానము

పొట్టులేని పెసరపప్పు 1 పావుశేరు, 2 పావుశేర్లు బియ్యముకలిపి తిరగలిలో మెత్తనిపిండి విసర వలెను. విసరిన పిండిలో ఒక గరిటె పేరిననెయ్యి, వుప్పు, కారమువేసి నీళ్లుపోసి కలపవలెను. బాణలిలో నెయ్యివేసి పొయ్యిమీదపెట్టి బాగా కాగిన తరువాత జంతికల గిద్దలో పిండివేసి బాణలిలో వత్తవలెను. ఇవి గుల్లవిడిచి తినుటకు చాల రుచిగా నుండును.

కొల్లిపూడి అన్నపూర్ణమ్మ

## చామగెడ్డల పచ్చడి

5 పలముల చామదుంపలను కొద్దిగా పసుపు, కావలసినంత ఉప్పువేసి మెత్తగా ఉడకబెట్టవలెను, తర్వాత పైతోలు తీసివేసిన దుంపలను ఒక గిన్నెలో నుంచుకొనవలెను.

బాణలిలో కొద్దిగా నూనెపోసి పొయ్యిమీదపెట్టి అందు కొద్దిగా ఆవాలు, జీలకర, మినపప్పు, 7, 8 ఎండుమిరపకాయలువేసి వేయించవలెను, ఆవాలు చిటపటమని వేగుచున్నప్పుడు మంచి సువాసన వచ్చును. అప్పుడు పొయ్యిమీదనుండి దించి రోటియందుంచి నూరి అందులో ఉడికించిన చామదుంప లను, కొంచము చింతపండు, కొతిమేరాకువేసి బాగా కలుసునట్లు నూరి వాడుకొనవచ్చును. అవసరమయి నచో కొద్దిగా ఉప్పు చేర్చుకొనవచ్చును.

చిపురుల లక్ష్మీకాంతమ్మ

రేడియో నాటిక :

# బురదపూరు

(గతసంచిక తరువాయి)

**ముందు కథ :**

భుజంగం దంపతులు తమ కుమార్తెకు తగిన సంబంధమును కుదుర్చుకొనే విషయము మాట్లాడుచుండగా యజ్ఞయ్య వాళ్లయింటికివచ్చి తన దృష్టిలో మంచి సంబంధ మున్నదనియు, కట్నాలు కానుకలుకూడ విశేషంగా నివ్వనక్కరలేదనియు చెప్పాడు. భార్యా భర్తలు తమ సంతోషాన్ని తెలిపారు. యజ్ఞయ్యగారు పిల్లను పిల్లవాడి తరఫువారు చూచి, వారికి నచ్చితే పిల్లవానిని భుజంగం దంపతులు చూచే ఏర్పాటు చేస్తానన్నాడు. ఇక చదువండి—

(గోపాల సుందరం ప్రవేశం)

(రెండోరంగం - యజ్ఞయ్య)

యజ్ఞ:-గోపాలసుందరంగారూ! మన అబ్బాయికి ఘట్టుక్లాసు సంబంధం వకటి వచ్చింది. మనకన్నివిధాలా తగిందే. కట్నం కానుకా యివ్వడంలో గూడా అభ్యంతరం ఏమీలేదు. మరి మీ యిష్టం యేమిటో! యింతకూ ప్రాప్తి మాత్రం ముఖ్యంగా వుండాలిలెండి. ఆలోచించండి.

గోపా:-అట్లాగాండీ! అయితే చూతాము దానికేమి? మనకు కట్నకానుకలతో గూడ అంత నిమిత్తం లేదనే విషయం మీకు గూడా తెలిసిందేకదా! మంచి సంప్రదాయం, నెమ్మదయినవాళ్లు, అనువద్దికగల పిల్లా అయితే కట్నం అంతగా ప్రధానంగాదు; చేసుకోవచ్చు.

యజ్ఞ:-అటువంటి సంబంధం కాబట్టే మీకు చెప్పాననుకోండి. వాళ్లు చాల మంచి వాళ్లు. అయితే వొకసారి వెళ్లి చూచి వద్దాం. కారుమీద వెళ్లొచ్చు. మనకు గంట గంటకూ కార్లు గూడా వున్నాయి.

గోపా:-అయితే రేపు సప్తమి వెళ్లి వద్దాం లెండి. పిల్లను మా ఆడవాళ్లు కూడా చూడాలి కనుక ఆవిడను గూడా తీసుకొని వెళ్లి చక్కా వద్దాం.

యజ్ఞ:-సరేచిత్తం. నేను మా అమ్మాయి గారింట్లో వుంటాను. మీరు ఏబండి కంటే కరెక్టుగా ఆటైముకు బస్టాండు దగ్గరికి వచ్చేస్తా.

గోపా:-అయితే రెండుగంటల కారుకి వెళ్లుదాం. అప్పటికి సిద్ధమై రండి.

మూడోరంగం

(భుజంగంగారియింటి వీధి)

యజ్ఞ:-అయ్యా! ఇక్కడేనండి వాళ్లయిల్లు. అదుగో ఆపెద్ద అరుగులదగ్గరికి తీసుకు రామ్మా బండిని... అమ్మాయి రమణమ్మగారూ! ఇంట్లో వున్నారా భుజంగం బావగారు?

రమ:-రాండి, ఉన్నారు. ఇప్పుడే యిట్లా వెళ్లారు. వస్తారురండి. వాకిట్లోబండి వున్నట్లుంది. ఊరినుంచా యేమిటి రావడం?

యజ్ఞ:-అవును. బావగారిశక్తి సామర్థ్యాలు కనుక్కోడానికి వియ్యాలవారు వచ్చారు మరి; సమయానికి తప్పించుకు పోయి నారే యీాయన యింట్లో లేకుండా.

రమ:-ఇప్పుడే వస్తారు లెండి... అమ్మా! రాండి యివిగోనీళ్లు కాళ్లుకడుక్కోండి. యిట్లాలోపలికి రాండి... అన్నయ్యా! మీరుయిద్దరు గూడా కాళ్లుకడుక్కోండి మంచినీళ్లు తెస్తాను.

యజ్ఞ:-అట్లాగే .... ఓహో? బా వ గా రు రానేవచ్చారు సమయానికి, రండి.

భుజ:-ఎప్పుడురావడం? ఎంతసేపయింది?

యజ్ఞ:-ఇంతకుముందుగావచ్చి మీకోసమే నిరీక్షిస్తున్నాం.

భుజ:-నేనిప్పుడేనండి అటులైబ్రరీ పక్కకు వెళ్లాను.

రమ:-మంచినీళ్లు పుచ్చుకోండి అన్నయ్యా!

యజ్ఞ:-
గో.పా:- } —— చాలు.

భుజ:-అయ్యా! ఆకుర్చీలో విశ్రమించండి.

యజ్ఞ:-సరే విశ్రమిస్తారు. బావగారూ! మొన్న మనకున్నవారు వీరికుమారుడే పెళ్లి కావలసిన పిల్లవాడు. పిల్లను చూడాలనే వుద్దేశంతో దంపతులిద్దరూ వచ్చారు.

భుజ:-అట్లా గాం డీ. మంచిది ... ఇదిగో అమ్మాయి బడినుంచీ వచ్చిందా?

రమ:-వచ్చేవేళయింది. వస్తూండాలి. (అటు చూచి) ఆ! యిదిగో రానేవచ్చింది. నూరేండ్లాయుస్సు.

భుజ:-అమ్మా! బుచ్చితల్లీ! పుస్తకాలింట్లో పెట్టి రామ్మా!

బుచ్చి:-ఏమిటి నాన్నగారూ! అట్లా అంటారు?

భుజ:-ఏంలేదమ్మా! యజ్ఞయ్య మామయ్యా వాళ్లూ వచ్చారు. ఒక్కక్షణం కూర్చుని పోదువుగాని రా.

గో.పా:-ఎందుకులెండి వెళ్లనీండి లోపలికి.

యజ్ఞ:-అయితే భుజంగంబావగారూ! కట్న కానుకల విషయంలో మీ అభిప్రాయ మేమిటి?

భుజ:-బావగారూ! నేను నాలుగువేలరూపా యలదాకా యిద్దామని యిదివరలో సంకల్పించే వున్నాను. ఇంకా పిమ్మట బావగారి యిష్టం.

గోపా:వాట్లవిషయంలో పెద్దప్రశ్న యే మంతగా లేదులెండి. మీసంగతంతా యజ్ఞయ్యగారు చెప్పారులెండి. మీరక్కడికిరాండి. అక్కడ యిటువంటివి అన్ని విషయాలూ మాట్లాడుకోని చూతాం.

యజ్ఞ:-అయితే ముహూర్తం వగైరాలు గూడా అక్కడే నిర్ణయించుకోవచ్చు మనం దశమినాడక్కడికి వెళ్లివత్తామా!

భుజ:-ఆ! దశమి యేకాదసుల్లో తప్పక వెళ్లివద్దాం.

గోపా:-చిత్తం. అయితే షేం సెలవు తీసుకుంటాం. కారువేళ గూడా కావస్తున్నది.

భుజ:-సరే. మనపూర్వపద్ధతి ప్రకారం వుండ మనటానికి గూడా అవకాశం లేదుగా మరి.

యజ్ఞ:-వెళ్లొస్తాం. వదినగారూ! వస్తున్నారు కదూ! పదండి వెళ్లొవద్దాం.

నాలుగో రంగం

(తలుపు చప్పుడు)

సను:-ఎవరూ? వస్తున్నా బజారుతల యిల్లు కావటం మూలాన దుంప తెగుతోంది. పొద్దస్తమానం ఎవరో వొకరు వస్తూనే వుంటారు (తలుపుతీసి) మీరా? కాళ్లు కడుక్కోండి. అప్పుడే అయిందా యేమిటి మీరెళ్లినపని- వచ్చేశారు.

భుజ:-అయింది. ఎంతసేపు. అన్నినిర్ణయాలూ మన మిక్కడ చేసుకున్నవే నాయె.

రమ:-కట్నం వగైరా విషయాల్లో వాళ్లేమీ పేచీపెట్టలేదూ మరి?

భుజ:-ఎబ్బె! వాళ్లు చాల సౌమ్యులు సుమా! వెండిచెంబులు వగైరా లాంచనాలు కూడా వుంటే బాగుండునని సూచించారు. నే దానికిసరేనని వచ్చాను. జ్యేష్ఠమాసంలో వ్యవధిగా ఒకలగ్నం కూడా చూచివచ్చాం. కుర్రాణ్ణి కూడా చూచి వచ్చాను. మంచివాడే. చాలా తృప్తికరంగా వుంది నా సంబంధం, మనకు సరితూగేటట్లుగా.

రమ:-అట్లాగా? ఏమో! మన బుచ్చితల్లి అదృష్టం మంచిదేమో! మరి నేను గూడా వెళ్లిచూచిరానా?

భుజ:-అభ్యంతరం ఏమిటి? రేపేవెళ్లి తప్పక చూచిరా!

రమ:-అట్లాగే. నాకుగూడా తృప్తికరంగానే వుంది. కాని ఆడవాళ్లుగూడా చూచి రావటం ధర్మంకదా! అని అంటున్నాను.

భుజ:-కాబట్టే వెళ్లిరమ్మంటున్నాను.

రమ:-అయితే రేపుతప్పక వెళ్లి చూచి వస్తాను మరి.

ఐదోరంగం

(ప్రవేశం రమణమ్మా భుజంగంగారూ)

భుజ:-ఇదిగో! ఆవూరికి వెళ్లివచ్చావుగదూ! విశేషాలేమిటి?

రమ:-ఏమండీ! అత్యుత్తమమైన సంబంధమంటిరి యజ్ఞయ్యగారూ, మీరూను. దీన్ని మించిన సంబంధం ఎక్కడా లేనే లేదంటిరి! అన్నీ బాగానే వున్నాయిగాని ఏమి వూరండీ అది - నా మొఖం వూరు?

భుజ:-ఏం ఆవూరుకి? లోపమేమిటో చెప్పూ.

రమ:-లోపమేమిటి అని అంటున్నారు యింకా? ఇంతవుంది చూస్తే నే చూచేదేమిటని నేను వెళ్లటం మానెయ్యాలే. యింకానయం. అట్లా అయినట్లయితే తరువాత జీవితాంతం వరకూ అనుకుంటూ ఉండాల్సి వచ్చేది.

భుజ:-ఏం? అసలు లోపమేమిటో బయట పెట్టావు కాదు. ఇంతవఱకు.

రమ:-ఏమేమిటి? వర్షం కురిస్తే ఆవూరి అందం చూడాలి. గిలకలలోతు దిగబడే బురద.

భుజ:-ఓ! అదా? అదేమంత యిబ్బందయిన సంగతి కాదే? మంచిరోడ్డు వున్నది. రోడ్డు కాక యితర ప్రదేశాల్లోనైనా ఆవానల రెండు మూడు నెలలే అడపా తడపా కొంచెం యిదిగా వుంటుంది. గాని తరువాత తక్కిన కాలమంతా ఆవూరితో సమానమైన వూరువుంటున్నదా వేరే. అయినా యీవిషయం వొక్కటే గమనించావు, కాని తక్కిన విషయాలేమీ నువ్వు గమనించలేదా యేం? ఆస్తిపాస్తులు, వాళ్లమంచి చెడ్డలు, స్థితిగతులూ, బాగా గమనించు.

రమ: ఆ! ఎన్నుంటే యేమండీ గ్రామ సౌకర్యం లేకపోయిన తరువాత?

భుజ:-అయ్యో! గ్రామ సౌకర్యం లేదంటావేమిటి? నీగొడవ పాడుగానూ. గ్రామ సౌకర్యం యేం లేకపోయింది? లక్షణంగా ఏడాదిపొడుగునా ఎక్కడికి బడితే అక్కడికి వెళ్లడానికి ప్రయాణ సౌకర్యాలూ, సమృద్ధి అయిన మంచినీరూ, అదీని. ఒక్క బురద అయినా ఆరెండు నెలలూనూ, యేమంత యిబ్బంది?

రమ:-ఆ! యిబ్బందేనండి. నేను నాపిల్లను ఆవూరివ్వటానికి వొప్పుకోనండీ, మీరేమైనా అనండి.

భుజ:-ఆ? ఆ? అంతమాటే? ఏదో సామాన్యంగా అంటున్నావనుకున్నా, ఎందుకు నీకీ పట్టుదలా?

రమ: పట్టుదలేమిటి! ఆస్తి వుండనీయ్యండి, అదంవుండనీయ్యండి, భాగ్యం వుండనీయండి, నేనుమాత్రం ఆబురదవూళ్లో నాపిల్లను అడుగుపెట్టనియ్యను.

భుజ:-ఇదిగో! నీవనవసరంగా పట్టుదల పట్టకు. రాజే కింకరుడవుతాడు. కింకరుడే రాజవుతాడు. నీవంత పట్టుపట్టి బురదలేనివూళ్లో యిస్తేమాత్రం వాళ్లదురదృష్టాన వాళ్లు యిటువంటి వూళ్లల్లో వుండటం తటస్థింపగూడదా? లేదూ?

వీళ్లే బురదలేని మరోవూళ్లో వుండటం తటస్థింప గూడదా? ఎందుకింత పట్టు పట్టి యీ సంబంధం వద్దంటావు? నా మాట విను.

రమ:-కాదండీ మీరేమన్నా చెప్పండి, యీసంబంధం వద్దు. నామాట వినక చేస్తే పిల్లను బావిలో పడేసి నేనుగూడా పడటం తప్పదు.

భుజః-అబ్బా! ఎంత గట్టి పట్టు పట్టావే. తప్పదా? నీమాటనుబట్టి యీసంబంధం మానుకోక తప్పదా? తప్పదా? అబ్బా! ఎంతమంచి సంబంధం నీమూలకంగా మానుకోవలసి వచ్చిందే? "స్త్రీబుద్ధిః ప్రళయాంతకీ" అన్నమాట నిజంగా సార్థకమౌతుందేమో గదా! అయితే యికనీష్టమొచ్చిన సంబంధం వెదకి చేసుకో! నేనుమాత్రం జోక్యం కలిగించుకోను.

రమః-ఏం, పోనీయండి. ఒక పట్నవాస సంబంధం చూచి చేస్తాను. ఈబురద వూరి సంబంధమే గతాయేం!

♦ ♦ ♦

(పదియేండ్ల తరువాత)

(ప్రవేశం భుజంగంగారూ, రమణమ్మగారూ)

భుజ-ఇదిగో! ఆరోజున నాగొంతు నరుక్కుంటానంటూ, గోలచేసి "బురద వూరు నేను తిరుగలేను, నాపిల్ల తిరగలేదు" అంటూ ఉత్తమమైన సంబంధాన్ని బురదవూరనే వొక్క కారణంతో తిరుగగొట్టేశావు కదూ! పైగా యింకొక సంబంధం ఏదో ఏరి కోరి చేశావు కూడా. కదూ! ఆతరువాత వారి వారి పరిస్థితులెట్లా మారినవో చూశావా?

రమః-ఏం? ఏం? ఏం మార్పులు జరిగినవేం?

భుజః-సరే మన అల్లుడి సంగతి నీకు తెలిసిందే కదా! "ఎంతో మంచివూరు. మనపిల్ల మట్టిలో కాలు పెట్టక్కర్లే" దంటూ ఆలోచించి యిచ్చావు, అతని కావుద్యోగం బురద వూరులోనే అయి, అక్కడే ఆవుద్యోగమే ఖాయమయ్యేట్లుగా ఉందికదా! పోనీ వుద్యోగం మానేసి యింటిదగ్గరే వుందామా? జరిగే యెత్తు లేకపోయె.

ఇంక బురద వూరనుకొన్న సంబంధం పిల్లవాడికి శాశ్వతంగా ప్రక్కనుండే మంచి బస్తీలోనే వుద్యోగం ఖాయమైపోయింది. రెండువందలు జీతం ఇస్తున్నారు. ఆరువేల కట్నమిచ్చి పిల్లనిచ్చారు వివాహమైంది కూడా. ఆపిల్లవాడు వుద్యోగంలో లేకపోయినా స్వయంగా నైనా తన ఆస్తి పెట్టుకొని మంచి బస్తీవూళ్లోనే వుండవచ్చు. నేనప్పుడెంత చెప్పినా నీవు వినకపోతివి, చూశావా? అప్పుడెట్లా అనుకున్నది ఇప్పుడెట్లా జరిగిందో.

కాకపోయినా, తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడు కాబట్టి యేదో మంచి సంబంధం మనంచూచి చెయ్యాలి. కాని వారుకు వాళ్ల భవిష్యత్తంతా మనం నిర్ణయించలేము.

రమ:-ఏమోనండి. ఇట్లా జరుగుతుందని నేనుమాత్రం అనుకున్నానా? ఇంతకూ దైవలిఖితం.

భుజ:-ఆమాటే నేనప్పుడు "కింకరుఁడే రాజగు రాజే కింకరుడగున్ కాలానుగుణ్యంబుగన్" అని చెపితే యేమన్నావిన్నావా? కాబట్టే ఆడుబుద్ధి ఒకప్పుడు ప్రళయానికూడా దోవ తీస్తుందని అన్నపెద్దలు పిచ్చివాళ్లా మరి?

అవ్వారి వాసుదేవశాస్త్రి

(దక్కన్ రేడియోవారి సౌజన్యముతో)

—(0)—

#  నిర్భాగ్యజీవి 

శ్రీమతి మోపర్తి కమలాంబ

అది ఒక పల్లెటూరు. అందు ఒక పేద బ్రాహ్మణుని గృహము. బ్రాహ్మణుడు ఎక్కువ దైవభక్తిగలవాడు. ప్రతిదినముదయముననే నిద్రమేల్కొని స్నానపానాదుల నాచరించి కాళికాదేవి దేవళమునకు అర్చనచేయుటకై పోవుచుండెడివాడు. అతని భార్య, శాంతమ్మయు ఎక్కువ వినయ విధేయతలు గలినదై, భర్తకనుగుణ్యముగా ప్రవర్తించుచుండెను. కాని వారిక సంతానములేదు. ఎన్నియో నోముల నోచినది శాంతమ్మ, కాని లాభములేకుండెను. శాంతయ్యయు కాళికాదేవి సముఖమునందు ఎన్నియో వ్రతములు చేసెను. కాని లాభము కనుపించకుండెను. శాంతమ్మకు సంతాన వాత్సల్యము తగ్గలేదు. పసిబిడ్డ పెరటియందు పచ్చపచ్చగా ఎప్పుడు తిరుగునాయని యువ్విళ్లూరుచుండెను. ఒక దినమునందు శాంతమ్మ భర్త పొరుగుపల్లెకు పోవుచూ భార్యతో కాళికాదేవికి అర్చన జాగ్రత్తగా జరుపుమని చెప్పెను. ఆ దినము శుక్రవారమగుటచే శాంతమ్మ అభ్యంగన స్నానమాచరించి చిత్ర విచిత్రమైన పూలమాలలు కట్టి పళ్లెమునందుంచి, పండ్లు, ఫలహారములనందుంచి ఘల్లు, ఘల్లు మని అందెలు మోగగా కాళికాదేవిని పూజించుటకు దేవాలయమున కరిగెను. ఇత్తడి బిందెను చంకనబెట్టి నిర్మలమైన భాగీరథీ జలమును కొనివచ్చి కాళికకభ్యంగన జలకమాడించెను. తాను తెచ్చిన పసుపు కుంకుమతో అలంకరించి, పూలదండలతో విగ్రహమునలంకరించెను. శాంతమ్మ ఎక్కువ భక్తితో కాళికను కొలుచుచుండెను. కాళికాదేవికి శాంతమ్మ భక్తిని, దయను పరీక్షింప నెంచి ఒక ముదుసలి వేషమును ధరించి దేవళము ముందు రోదనము చేయ మొదలిడెను. అప్పుడు శాంతమ్మ దేవళములోనుండి పరిగిడి వచ్చి ఏమని ముదుసలిని ఓదార్చెను. అప్పుడా ముదుసలి తను ఎంతో ఆకలి బాధతో మలమలమాడి పోవుచుంటిననియు, కాళికాదేవికి తెచ్చినవన్నియు తన ముందే పెట్టుమని రోదనము దొడంగెను. శాంతమ్మయు శాంతస్వభావముగలదై కాళికకర్చనకై తెచ్చిన వన్నియు భక్తితో, దయతో, ప్రేమతో ముసలికి తినిపించెను. అప్పుడా ముసలి మూర్ఛ వచ్చినట్లుగా నటించి నేలపై సాగిలపడి కాళ్లు, చేతులు కొట్టుకొన దొడంగెను. శాంతమ్మయు దగ్గరనున్న కొలనుకు పోయి ఎన్నియో బిందెలజలమును తెచ్చి ముదుసలికి స్మృతి వచ్చువరకునూ పోయుచూనే యుండెను. కాని ఎంతసేపటికిని ముదుసలికి స్మృతి రాలేదు. సున్నితమైన శాంతమ్మ దేహము సూర్యుని వేడికి కందగడ్డ అయ్యెను. ఒడలెల్ల చెమటచే తడిసెను. శాంతమ్మ కెంతయో అలసటవచ్చెను. కాని బిందెలతో జలమును కొనివచ్చి ముదుసలికిచ్చుట మాత్రము మానలేదు. అప్పుడు ముదుసలి రూపముతో నున్న కాళికాదేవి నిజరూపమున ప్రత్యక్షమై శాంతమ్మ భక్తిశ్రద్ధలకు మెచ్చి వరమడుగమనెను. అప్పుడు శాంతమ్మయు చేతులు జోడించినదై కాళికాదేవిని "ఎల్లప్పుడును భక్తితో తనను (కాళికాదేవిని) కొల్చునట్లును, జీవమును బాసిన పిదప తనలో ఐక్యమగునట్లును ప్రసాదింపుమని వేడెను. కాళికాదేవియు అందులకంగీకరించి సంతాన ప్రాప్తి అనతి కాలములోనే కలుగుననియు పల్కి అంతర్ధానమయ్యెను. శాంతమ్మయు జరిగిన సంఘటనను మనస్సున తలంచుకొనుచు ఇంటి ముఖము పట్టెను. సూర్యుడు తనయొక్క కిరణసముదాయముచే పుడమినెల్ల ప్రకాశింప జేయుచుండెను. ఉష్ణతాపమునకు భీతిల్లి పక్షులు తమబిడ్డలతో తమగూళ్ళయందే యుండెను. ప్రజలుకూడా ఉష్ణతాపమునకు వెరచిరి కాబోలు శయ్యామందిరములలో పరుండిరి. చెట్లు ఎండ వేడిమిని భరింపజాలక తలలువంచినవి. తుమ్మెదలగుంపులు తమ కవసరమగు మధువును గ్రోలుటకు పూవు పూవున కెగురుచుండెను. అట్టి తరి పొరుగు పల్లెకుపోయిన శాంతయ్య వచ్చుచుండెను. ఎండ తీక్షణమునకు తాళజాలక ఎటులో కష్టపడి యిల్లు

చేరుకొనెను. అలసి సొలసివచ్చిన భర్తను ఎంతో ఆప్యాయముతో శాంతమ్మ అతని కష్టమును మరపించునట్లుగా చేసెను. తరువాత స్నానముచేసి భోజనముచేసి ప్రయాణబడలిక తీర్చుకొనుటకై శయనించెను. పరుండినదే తడవుగా నిద్రాదేవిఒడిని చేరెను. ఆగాఢ నిద్రలో తనకు కొలదికాలములో సంతాన ప్రాప్తి కలుగ గలదన్న వాక్కులు వినవచ్చెను. నిద్ర మేల్కొని తనకు కలయా, భ్రమయా అని ఏమియు తోచక భార్యను పిలిచి చెప్పెను. అప్పుడు శాంతమ్మయు చిరునగవు మోముతో తనకు దేవి ప్రత్యక్షమైనట్లును, తను చేసిన సేవయు మున్నగు విషయములు పూసగ్రుచ్చినట్లుగా చెప్పెను. శాంతయ్యయు మోమున సంతోషాతిశయమున భార్యను పొగడెను.

ఇట్లు కొంతకాలము గడచినపిదప శాంతమ్మ గర్భవతి అయ్యెను. నవమాసములునిండిన పిదప ఒక దినమునందు శాంతమ్మ ప్రసవ వేదన పడుచుండెను. ఇరుగు పొరుగు వారందరూ త్రుటి కాలములోనే గుమిగూడిరి. శాంతయ్య అదృష్టవంతుడనియు, శాంతమ్మ నోములపంటయనియు, కాళికాదేవి మహాత్మ్యమనియు, ఎవరిష్టమొచ్చిన విధముగ వారు మాట్లాడుచుండిరి శుభసమయమునందు శాంతమ్మయు శాంతస్వరూపిణివంటి ఆడశిశువును కనెను. శాంతయ్య సంతోషమునకు మేరలేదు. ఇరుగుపొరుగువారును సంతోషపడిరి. పదునొకటవ దినము నాడు శాంతమ్మను స్నానమాడించిరి, పురోహితులు వచ్చిరి. ఇరుగు పొరుగు వారితోను, బంధుమిత్రులతోను ఇల్లు కళకళలాడుచుండెను. అందరి సమక్షములోనికిని బిడ్డను కొనివచ్చిరి. ఆ బిడ్డకు శాస్త్రయుక్తముగా చంద్రిక యని పేరుపెట్టిరి. చంద్రికయు ఆరోజునకారోజు శుక్లపక్ష చంద్రుని మాడ్కి పెరుగుచుండెను. భార్యాభర్తల సంతోషమునకు మేరలేకుండెను. ఇట్టి సమయమునందు శాంతయ్యను కారు మేఘములు క్రమ్ముకొనెను. అతనిని చీకటి ఆవరించెను. అతని జీవితములోనున్న జ్యోతి ఆరిపోయెను. శాంతమ్మ తన నోములపంటయు, తన ముద్దులబిడ్డయునైన చంద్రికను ప్రాణసమానుడైన భర్తను వీడి పరలోకమందున్న కాళికాదేవిలో లీనమయ్యెను. శాంతయ్యకు వేరు దిక్కులేనివాడై కాళికాదేవిని కొల్చుచు, తన ముద్దుబిడ్డయు, సుగుణాలరాశియునైన చంద్రిక నల్లారు ముద్దుగా పెంచుచుండెను. చంద్రికయు ఆ దినమునకాదినము పెరుగుచుండెను. వచ్చిరాని మాటలతో తండ్రిని సంతోషపెట్టుచుండెను. తప్పటడుగులతో తండ్రి పనిలో ప్రవేశించి తండ్రి పనికి అడ్డవచ్చుచుండెడిది. శాంతయ్యయు భార్య పోయిన దిగులు మరచి చంద్రికనే ఎంతో గారాబముగా పెంచుచుండెను చంద్రికకు ఇరుగు పొరుగు పిల్లలతో సఖ్యత కుదిరెను. తోటి స్నేహితుల ప్రోత్సాహముచే శాంతయ్య ఏకపత్నీవ్రతము విడనాడి పునర్వివాహమాచరించెను. చంద్రికను సవతి తల్లి వచ్చిన క్రొత్తలో గారాబముగా చూడమొదలిడెను. అందులకు శాంతయ్య సంతోషించెను, శాంతయ్య రెండవభార్య వలన సంతానవంతుడయ్యెను. చంద్రికయు తన తండ్రి వద్ద భగవద్గీత, వేదపఠనము, సంగీతము మొదలగునవి నేర్చుకొనుచుండెను. తల్లి శాంతమ్మ భక్తిపోకడలే బిడ్డకలవడెను. చంద్రిక తండ్రికన్నముందే నిద్ర మేల్కొని నిత్యకృత్యములను తీర్చుకొని ప్రాతఃకాలముకాగానే కాళికాలయమునకరిగి కాళికను పూజించుచుండెడిది. మరలివచ్చి యింటి పనులను చూచుకొనుచుండెడిది. ఉదయ సాయంత్రములం చంద్రిక భక్తితో కాళికను కొల్చుచుండెడిది. సవతి తల్లికిది కష్టముగానుండెను. చంద్రికను ఇంటెడు చాకిరి చేయమని వేధింపమొదలిడెను. కాని చంద్రికకున్న చిన్నవయస్సునందామెకు ఆటలపై ధ్యాస యుండునని చెప్పుటలో అతిశయోక్తి ఏమున్నది? కాని సుగుణాలరాశి అయిన చంద్రిక సవతితల్లి చెప్పు పనులన్నియు మెళుకువతో ముగించితన స్నేహితురాండ్ర యొద్దకు ఆటలకై పోవుచుండెడిది. తోటి పిల్లలతో కలసిమెలసి తిరుగుటచే ఇరుగు పొరుగు తల్లుల ప్రేమకు పాత్రురాలయ్యెను. చంద్రికను చూచిన ప్రతివారును శాంతమ్మను జ్ఞప్తికి తెచ్చుకొనెడివారు, శాంతమ్మయుండిన కూతురును చూచి

ఎంత మురిసిపోయెడిదో గదా యని వాపోవుచుండెడి వారు. శాంతయ్యను దారిద్ర్యదేవత ఒడిలోనికి లాగుకొనెను. ఆనాటికానాటికి కష్టములు భరింపజాలకుండెను. లోలోన శాంతయ్య దారిద్ర్యబాధ ననుభవింపలేక క్రుశించుచుండెను. ఆకలి బాధకు మలమలమాడి పోవుచుండిరి. బిడ్డల యొక్క దుస్థితిని చూచి ఎంతయో దుఃఖించుచుండిరి. చంద్రిక పన్నెండుయేళ్లు కలదయ్యెను. మీదు మిక్కిలి శాంతయ్యకు చంద్రిక వివాహమును గురించి పెద్ద సమస్య అయ్యెను. ఏ పని చేయుటకైనను ధనము కావలయునుగదా! శాంతయ్యకు డబ్బు కరువయ్యెను. ఎన్నియో సంబంధములు విచారించివచ్చెను. కాని అన్నియు అందని పండ్లయ్యెను. శాంతయ్య అందని పండ్లకై అఱ్ఱులుచాచరాదని నిశ్చయించుకొనెను. ధనాశ, సవతితల్లి పోరు ఈ రెండునూ కూడినవి, మిసమిస లాడుచున్న చంద్రికను కాటికి కాళ్లు చాచిన ముసలిబడుగునకు ధనాశకులోనై బలిచేసిరి. చంద్రికయు వేరు దిక్కులేనిదై తల్లిదండ్రులు చేయు దుండగమును చూచుచుండెను, మనస్సునందు దైవము తనకట్టి దానినిప్రసాదించెను కాబోలునని దిటవుచేసుకొనుచుండెను. కాళికను మాత్రము ఎల్లవేళల పూజించుచుండెను. నిర్ణీత ముహూర్తమున చంద్రికకు ముసలిబడుగుతో వివాహమాయెను. చంద్రిక తోటిపిల్లలతో ఆటపాటలందున్నప్పుడందరూ అమ్మమ్మయనియు, తాతయ్యకు పండ్లూడి పోయినవనియు గేలిచేయుచుండెడివారు. చంద్రికయు పిల్లలతో ఆడుటకు సిగ్గుపడి ఆటలుమానివేసెను. కాళికను మీదు మిక్కిలి భక్త్యావేశములతో గొలుచుచుండెను! యుక్తవయస్సు రాగానే చంద్రికను తీసికొని పోవుటకై ముసలి బడుగువచ్చెను. శాంతయ్యయు చంద్రికనత్తవారింటికి పంపుటకై ప్రయాణ సన్నాహములుగావించుచుండెను. శాంతయ్య చంద్రికకు చేసిన అన్యాయమునకు లోలోన దుఃఖించుచుండెను. కానిపైకి మాత్రము తొణకకుండెను. చంద్రికయు మనస్సునందు పొంగి పొరలి వచ్చు దుఃఖమునిను మడింపచేసుకొని కాళికాదేవికి మ్రొక్కి తరలి వచ్చెను. చెల్లెండ్రను, తమ్ములను, స్నేహితులను పిలిచి వారికి మంచి నీతులనుభోధించినది సుగుణశీల చంద్రిక. తల్లి దండ్రులను, ఇరుగుపొరుగు వారికిని తన్ను మరువక అప్పుడప్పుడు తలంచుకొను చుండుడని చెప్పి కన్నీరు కార్చినది. బిడ్డలుగన్న ప్రతి యిల్లాలుకును చంద్రికను చూచిన జాలివేయును. కాని సవతి తల్లిమాత్రము మారు పలుకకుండెను. చంద్రిక తండ్రిని చేరినది. తండ్రి ఆశీర్వాదము పొంది, తన కాళిని మాత్రము మరువక ప్రతిదినము కొలుచుచుండమని చెప్పెను. కంటినీరు పెట్టుకొనుచు అందరికిని తుది నమస్కారముపెట్టి "మరల మిమ్ములను చూడలేను" అని చెప్పుచూ బండిలో పాదముపెట్టెను. ముసలి బడుగు యింటిలో ప్రవేశించినది. ప్రతి దినముదయముననే భర్తకు నమస్కరించి తనయొక్క పనులను నెరవేర్చుకొనుచుండెడిది. ప్రక్కననున్న కాళికాదేవి దేవళమునందు పూజచేయుచుండెడిది. అది ఒక పాడుబడ్డ దేవళము. చుట్టునూ ఒక తోటయుండెను. సాయంత్రము కాగానే పూజకై పూలుకోసుకొని బంగరు పళ్లెమునందుంచుకొని కాళికాదేవి గుడికి పోయినది. తన నిర్భాగ్యజీవితగాధను కాళికకు విన్నవించుకొని, కాళికలో ఐక్యమయి హాయిగా ఆమె ఒడిలో శాశ్వతనిద్రపోయెదానికి దేవి కాళ్లమీద పడిపోయింది. ముసలి బడుగు యింటికివచ్చి చంద్రికకొరకు వెదకెను. భావులు, చెరువులు, గుంటలు, మిట్ట వెదికించెను. తుదకు పాడుబడ్డ దేవాలయములోని కాళికాదేవి పాదములచెంత శాశ్వత నిద్రపోయిన చంద్రికను చూచి నిర్ఘాంత పోయెను. తల్లి దండ్రులకు వర్తమానముపంపి పిలిపించెను. నిర్భాగ్యజీవి చంద్రిక ఎవరు విలపించినను చూడదుగదా!




## బుల్లి "బుల్లికోరిక!"

చిలకనునేనై పలికేనా, మరి
కులకేనా అపర రంభనై, ఆడుతు పాడుతు
చిలికేనా గొల్లభామనై పెరుగును
ఒలికేనా ఒయ్యారంపు నెమలిని నేనై !
ఆడేనా అంజలిని మించి నాట్యము
పాడేనా సూర్యకుమారిని మించి గానము
వేడేనా శివుని సర్వజనులకు శాంతినిమ్మని,
పొగిడేనా భట్రాజునై పార్వతీపతిని.
కూసేనా కోయిలనై పుల్కు పుల్కున
చూసేనా ఓరచూపుల బంగారు లేడినై
పూసేనా గులాబి పువ్వునై, మల్లె జాజులు
గాసేనా పూపొదరింట, గుమ్ము, గుమ్మున!
రాసేనా చలంగారికి మించిన కథలు
గీసేనా బొమ్మల అడవి బాపిరాజుకి మించి
పోసేనా దీనజనుల కింత గంజి, మరి, మెరి
సేనా వెండితెర అభిమానపు తారనై !

మిస్. నిరుపమ గురుకల్

## మార్కొనీ-తల్లి

సర్వజీవులలోను మాతృదేవియే కీర్తిమకుటము ధరించుట కర్హత గలినట్టిది. సత్పుత్రులను గని, వారి శక్తి నెఱిగి దేశసేవకులగునట్లు చేయు మాత ధన్యురాలు. తల్లి వాత్సల్యపు చినుకులతో శిశువుల జీవన పల్లికి చిగిర్చి దేశమున కాహ్లాదము, సుపయోగము, కీర్తి గల్గించు పరిమళ సుమములను పుష్పింప జేయును. శిశువు జన్మించినది మొదలు దాని జీవిత నౌకకు చుక్కానియై సరియగు మార్గముల గుండా బోవునట్లు నడుపును. తల్లి ప్రేమ యనంతమైనది.

తల్లియొక్క ప్రోత్సాహము, శ్రద్ధవలననే మార్కొనీ సకల ప్రపంచమునకు విభ్రాంతి గొల్పు Wireless కనిపెట్ట గల్గినాడు. శైశవము నుండియు మార్కొనీ ఆరోగ్యమును, చదువును కడు శ్రద్ధతో పరీక్షించుచుండెడిది.

మార్కొనీ ప్రయోగములను చేసికొనుటకై ప్రత్యేకముగ రెండు విశాల గదులను యింటిపై భాగమున సమర్చి ప్రోత్సహించినది. ప్రతిదినమును యామె నిద్రింపబోవు సమయమైనపుడు మార్కొనీ

గది తలుపులను మృదువుగా తట్టెడిది. మార్కోనీ వెంటనే తలుపు తెఱచి సంతోషముతో నామెను లోనికి గొనిపోయి తన ప్రయోగములను జేయుటకమర్చిన వస్తుజాతమును జూపెడివాఁడు. మార్కోనీకి తల్లియనినచో భక్తి, శ్రద్ధ, గౌరవము, ప్రేమ. పుత్రుని యారోగ్యము చెడునేమో యను భయముతో నతనిని రాత్రియంతయు మేల్కొని యుండవలదని వారించెడిది. మార్కోనీకి తల్లియే విశ్వాసపాత్రమైన గురువు. పుత్రుఁడు ప్రయోగములందెంత పురోగమించెనో తెలిసికొనుటకై మిక్కిలి యాతృత పడెడిది. శ్రద్ధతో ప్రయోగమును కన్నులార వీక్షించి తృప్తి పడెడిది. పుత్రుని యశస్సే యామె యశస్సు. డిశెంబరు నెల యగుటచే నా దేశమున చలిబాధ మిక్కుటముగ నున్నను దానికోర్చి యామె పుత్రుని యొద్దనే యుండిపోయెను. పుత్రవాత్సల్య పవనముల ముందు బాధామేఘములేమి తాళఁగలవు!

మార్కోనీ తన ప్రయోగములందు విలీనుఁడై యాహారము గొనుటనే మఱచిపోయెడివాఁడు. మార్కోనీ తల్లి యెల్లప్పుడును కొడుకుపై దృష్టినిల్పియే యుండెడిది. రాత్రి సమయములందు మార్కోనీ చెంతకేగి నిద్రించుమనియో, నాహారము గొనుమనియో హెచ్చరించుచుండెడిది. తల్లికి బిడ్డల సౌఖ్యము కంటె నెయ్యది గావలయును?

ఒకరాత్రి మార్కోనీయొక్క తల్లి నిద్రించుచుండెను. ఎవరో యామె భుజమును దట్టి మేల్కొల్పుటచే నిద్రాభంగమయ్యెను. ఆమె కెదురుగా నందనుఁడు గాన్పించినాఁడు. అతని కోర్కె నేటితో దీరినది. అతఁడు విజయుఁడు. గాలిద్వారమున గుర్తులను, మాటలను యొక చోటినుండి మరియొక చోటికి పంపవలెనని పడిన కృషికి ఫలము నేటితో లభించినది. ప్రేమమయి యగు తల్లికి తనవిజయ సాధనము జూపించుటకై నతఁడు నడిరేయి వచ్చెను. ఆమె వెంటనే దుస్తులను ధరించి పుత్రుని చేయి పట్టుకొని యిరువురును మేడపై భాగమునకు పరుగిడిరి. మార్కోనీ యానందముతో నామెకు తన కృషిఫలితమును జూపించినాఁడు. ఒక మీట నొక్కి తీగలు లేకుండనే దూరముగా నొక శబ్దము జనించునట్లు చేసినాఁడు. విద్యుదంటను ప్రయోగించుటలో నతఁడు విజయము నొందినాఁడు. అతని యానందమునకును దల్లి యానందమునకును మేర లేదు. మార్కోనీ తల్లి యారాధ్యమూర్తి. మార్కోనీని యతని దల్లి 'కంట వత్తి నిడుకొని' పెంచినది.

మార్కోనీ యొక్క కృషిఫలితమే నేఁడీ స్వరూపము దాల్చినది. తల్లి తోడ్పాటు తోడనే మార్కోనీ దేశకళ్యాణ మొనర్చు కార్యము సాధించ గల్గినాఁడు. మార్కోనీ ప్రశంసా పాత్రుఁడు. మార్కోనీ తల్లి యాదర్శమయి.

'కలిపదభూషణ్' బి. ఏ.

# స్నేహలత

శ్రీ సూరిశెట్టి సాంబశివరావ్ బాజ్జీ

యామినీనాథుని భార్య దామినీలతకి యెనిమిదో కాన్పే స్నేహలత!

స్నేహలత చాలా క్లిష్టపరిస్థితుల్లో జన్మించింది. అప్పటికే యామినీనాథుడు అయిదుగురు కుమార్తెల పెళ్లిళ్లతో అణాగారి అప్పులలో మునిగిపోయాడు. ఇంకా యిద్దరబ్బాయిలున్నారు. వారి చదువు సంధ్యల ఖర్చులకి మరీ కష్టంగా వుంటూంది. యాభై రూపాయిల నెల జీతంతో పాపం యేం చేస్తాడు? యేంచెయ్యగలడు? - ఇదే అయోమయంగావుంది యామినీనాథుడికి!

ఎనిమిదో కాన్పుకి కొడుకేనా పుట్టకుండా మళ్లా కూతురే పుట్టింది. అయినా భగవదేచ్ఛకి యామినీనాథుడూ అడ్డుచెయ్యగలడా! - పొంగి పొర్లుకొచ్చే దుఃఖాన్ని మనసులోనే దిగమ్రింగుకుని ఆ పిల్లపేరు "స్నేహలత" అని పెట్టాడు. తల్లి తన ముద్దుకోసం "ముఖజరీ" అని పెట్టకుంది.

స్నేహలత - వయసు పెరుగుతూన్నకొద్దీ ఆమె సౌందర్యంగూడా యీడుకి రెండింతలుగా వృద్ధి పొందుతూ వచ్చింది. పన్నెండేళ్ల యీడులో పరిపూర్ణ యవ్వనం ఆ బాలిక ప్రతీ అవయవంలోనూ తొణికిసలాడ్తూంది. ముద్దుల మూటగట్టే ఆమె అంగ సౌష్టవాన్ని తిలకించి ఆమె పెళ్లి గురించి ఆలోచిస్తూ, ఆలోచిస్తూ, తల్లి దండ్రుల హృదయాల్లో ఓ విధమైన కంపనం బయల్దేరింది.

ఓ నాడు తల్లి కూరగాయలు తరుగుతూ తరుగుతూ వేలు కోసుకుంది. స్నేహలత అదిచూచి చటుక్కున పరుగెత్తుకుంటూవచ్చి నీటిలో బాగాతడిపిన గుడ్డ పేలికను ఆవిడవేలికి గట్టిగాకట్టి తల్లిమెడకి తన రెండు చేతుల్నీ మెలివేసి, - "అమ్మా నువ్వు రాత్రీ పగలూ యేమిటే యిలా ఆలోచిస్తున్నావ్?" అంటూ అడిగింది చిన్న నవ్వు నవ్వుతూ.

"పో-నువ్వాడుకో" అంది తల్లి విసుగ్గా. కాని స్నేహలత ఒప్పుకోలేదు.

"ఊఁహూఁ, చెప్పవే అమ్మా, చెప్పు" అంది మళ్లీ.

తల్లికి మరింత విసుగెత్తి కోపంగా ఆమె చెంప మీద కొట్టబోయింది. కాని ఆ దెబ్బ చెంపపైన తగలకుండా ఆమె కంఠానికి తగిలింది. పాపం ఆవిడ మళ్లీ వెంటనే జాలిపడి స్నేహలతని తన హృదయానికి హత్తుకుని, - "నీకింకా యెక్కడా చోటులేనట్లు యీ కష్టాలన్నీ అనుభవించేందుకు నా కడుపులో యెందుకు పడ్డావు తల్లీ" అంది.

స్నేహలత పరధ్యానంగా కూచుంది. చటుక్కున లేచి గెంతుతూ, - "అటు చూడవే అమ్మా. ఆ చిలక యేమంటూందో?" అంది.

పంజరంలో రామచిలక అదే సమయానికి "నా వరహాల తల్లీ, రా నాదగ్గిరికి, నాబంగారు బుచ్చీ, రా...రా" అంటూ పలుకుతోంది.

తల్లి కళ్లల్లో నీళ్లూరినై, - "వెళ్లు, చిలక్కి యేదేనా పెట్టు. నేను వంట చేసుకోవాలి" అంది.

స్నేహలత చిలకదగ్గిరి కెళ్ళకుండా నింపాదిగా తన నాన్నగారి గదిలో కెళ్లింది. అప్పుడే ఆయన యాభైరూపాయల జీతం అందుకుని లెక్కపెట్టుకుంటున్నాడు. ఫస్టువొచ్చేసింది. కొత్తనెల-అప్పుల వాళ్లు పీక్కు తినటానికింక ప్రతీగడియా అవతరిస్తూంటూరు. ఇంటి యజమాని అద్దెకోసరం వొస్తాడు. పాలవాడు జీతంకోసం వొస్తాడు - కిరణాశెట్టిగారూ, హల్వాసాయిబూ - కంసాలి మల్లయ్యా - అందరికీ యేదో కాస్తోకాస్త ముట్టజెప్పాలి. యామినీనాథుడికి వాటిని యేంచెయ్యాలో పాలుపోవటం లేదు.

అదే టయిముకి సరిగ్గా స్నేహలతవొచ్చి "నాన్నా" అంటూ పిలిచింది.

కాని ఆ పిలుపు ఆలోచనలో మునిగిపోయిన యామినీనాథుడికి వినిపించలేదు. ఆమె "నాన్నా" అని

యింకా గట్టిగా పిలిచింది. ఇప్పుడాయనకి విని పించి "యేంఅమ్మాయ్ ?" అన్నాడు.

అమ్మ యెందుకింతగా ఆలోచిస్తుందో నాన్న గారినడిగి తెలుసుకోవాలనుకుంది స్నేహలత ; కాని ఆయన మొహం చూసేటప్పటికి తన నోటంట మాటరాలేదు.

"కాణీ కోసమా, అమ్మాయ్ ? - యిదుగో ఈ కాణీ తీసుకో" అన్నాడాయన యెంతో ముద్దుగా.

స్నేహలత ఆ కాణీని కొంగులో పదిలంగా ముడి వేసుకుని తిరిగొచ్చి వీధివేపునున్న ఓ కిటికీ పక్కని కూచుని అమ్మా నాన్నా యెందుకింత విచారంగా వున్నారా అని ఆలోచిస్తోంది.

పాలవాడికి చాలా రూపాయిలు కావాలి, ఇంక పాలు యివ్వటం మానేస్తానంటూ బెదిరించి మరీ వెళ్లిపోయాడు. పప్పూ, బియ్యం దినుసులూ యిహ అరువుకి యివ్వటం ముమ్మాటికీ జరగదని షావుకారు ఉరిమి వెళ్లిపోయాడు. మూడురోజులలోపుగా డబ్బివ్వకపోతే కోర్టులో దావా పడేస్తానంటూ కంసాలి మల్లయ్య గర్జించి మరీ వెళ్లిపోయాడు. యింటికొచ్చే వాళ్లంతా డబ్బేగాని యింకొకటేదీ అడగటంలేదు. ఎవరేనావొచ్చి బయట్నుంచి పిలిచేసరికి యామినీనాధుడి మొహం మాడి పోతూంటుంది.

స్నేహలతకిదంతా అర్ధమైపోయింది. ఆమె ప్రతిరోజూ నాన్నగారి దగ్గిరే తిరుగుతూ వుంటూంది. యేతలుపుచాటునో, యేకిటికీ క్రిందనో, ఆ దగ్గిర దగ్గిరే యెక్కడో తన నాన్నగారి మొహం సరిగ్గా కనిపించేచోటు కూచుని ఆయనవేపు తన పెద్దపెద్ద కళ్లతో గుప్‌చిప్‌గా చూస్తూ వుంటూంది.

ఇవాళ నాన్నగారి మొహం చాలా నీరసంగా వుంది. ఆయన గుండెలపైని యెముకల్ని లెక్కపెట్ట గలిగేంత స్పష్టంగా అగుపిస్తున్నాయ్. రోజు రోజుకీ విచారంతో ఆయన సన్నమై చిక్కిపోతు న్నాడు. యిదంతా ఆలోచించుకుని తన రెండు చేతుల్తోనూ మొహం కప్పుకుని యేడవసాగింది స్నేహలత !

ఆ వేళ సాయంకాలం యామినీనాధుడప్పుడే ఆఫీసునుంచి యింటికొచ్చాడు. అంతట్లోకి యిద్దరు బీహారీ సిపాయిలు లాఠీలు పట్టుకుని ద్వారం దగ్గిరి కొచ్చి నించున్నారు, వారిలో ఒకతను గట్టిగా "యామినీబాబూ, యామినీబాబూ" అంటూ అర వటం మొదలెట్టాడు.

స్నేహలత పాపం ద్వారబంధం ప్రక్కనించి యమకింకరులాంటి ఆ యిద్దరు సిపాయిల్నీ చూచి గజగజా వొణికిపోయింది.

'వీరిద్దరూ నాన్నని కొట్టడానికిగాని రాలేదు గదా' అంటూ ఆలోచించి తటపటాయిస్తూ నింపా దిగా వారిదగ్గిరికెళ్లి, - "మీరు మా నాన్నని కొట్ట కండీ, ఆయనకి విచారం కలిగించకండీ, మీకాళ్లు పట్టుకుంటా, మీకు కుప్పలు కుప్పలుగా మా పెరట్లో పువ్వులిస్తాను" అంటూ విన్నవించుకుంది అమాయ కంగా.

ఆమె మాటలు వారికేమీ అర్ధంకాలేదు.

"మీరు మా నాన్నని కొట్టడానికొచ్చారుగదూ, అలా కొట్టకండీ ... ఆగండి, యిప్పుడే వొస్తాను."

ఆమె సాయంకాలం దండ గుచ్చుకోటానికని పువ్వులన్నీకోసి కుప్పలు పెట్టింది. అవన్నీ తన కొంగులో పోసుకొని తీసుకొచ్చి ఆ సిపాయి లిద్ద రికీయిచ్చి "యింక మీరు పొండీ" అంది యెంతో ప్రాధేయపడి.

వారిద్దరికీ యిదేమీ పాలుపోక ఒకరిమొహం మరొకరు చూచుకుంటూ యింకొకమాటు రావొచ్చు గదా అని మెల్లిగా వెళ్లిపోయారు.

స్నేహలత ప్రాణం తెప్పరిల్లింది. విశ్రాంతిగా ఊపిరి పీల్చుకుంది.

సాయంకాలం స్నేహలత డాబామీదికొచ్చి ఆలోచించటం మొదలెట్టింది.

'ఆహాహా! యీ పారిజాత పుష్పాలన్నీ రూపాయలైపోతే పొద్దున్నే లేచి అన్నీ తెంపి అమ్మకిచ్చేదాన్ని - అప్పుడు మా అమ్మాయి బంగారు పిచుకంటుంది అమ్మ. మాలత సాక్షాత్ లక్ష్మీదేవి అంటాడు నాన్న. పాలవాడి అప్పంతా తీరిపోయేది. కంసాలి మల్లయ్య డబ్బు గురించి నాన్నని బెదిరించకపోయేవాడు. అమ్మ రాణికిమల్లే నగలెన్నెన్నో అలంకరించుకుని కూచునేది. దాసదాసీ లెందరో చాకిరీచేసేవాళ్లు. నాన్న గుర్రంబండిమీద గాలి షికారుకని వెళ్లేవాడు.'

యిలా ఆలోచనల్లో మునుగుతూ తేలిపోతూ స్నేహలత నిద్రపోయింది.

మరి కాసేపటికి టపీమని ఆమె నిద్ర పాడైంది. తెలివొచ్చేక ఆమె చుట్టూ బాగా పరకాయించి చూచింది. ఆ వీధిలోనే వుంటూన్న మోక్షదా పిన్ని మాత్రం అమ్మతో యేవేవో గుసగుసలాడ్తూంది.

చెల్లాయ్, అయితే నువ్వింకా విననేలేదన్న మాట. కాళికాదేవి మన జమీందారు గారి భార్యకలలో కనిపించి, - "నేను మీ కొత్త చెరువులో వుంటున్నాను. వేగంగా యెనిమిదో కానుపుబిడ్డనెవర్నైనా తెచ్చి నాకు బలివ్వండి. అప్పుడే మీ జమీందారీ స్థితిగతులు బాగుపడ్తాయ్. మీరు చిన్న మనుమణ్ణిగూడా పొందుతారు. మీకన్నివిధాలా సౌఖ్యం లభిస్తుంది. లేదంటే మీరంతా అధోగతి పాలయిపోతారు" అంటూ చెప్పిందట. జమీందారుగారి భార్య ఆఘమేఘంగా యెవరైనా యెనిమిదో కానుపు పిల్లనిస్తే ఓ లక్షరూపాయిలు యివ్వటానికికూడా తయారుగావుంది అంటూ యింకా యేమేమో చెప్తూంది పిన్ని.

స్నేహలత యెంతో శ్రద్ధగా యిదంతా వింటూంది.

"ఊరుకో చెల్లీ, యిలాంటివేవీ చెప్పకు, విన్నా పాపమే, కన్నా పాపమే" అంది అమ్మ.

"అబ్బే, అదిగాదమ్మాయ్, మీ పిల్లనిచ్చేయమని నేనుగాని చెప్పటానికొచ్చానా యేంటి? అలా యెవరేనా యివ్వగలరనేనా?"

ఆ పొరుగావిడ వెళ్లిపోయేక తల్లి స్నేహలత వేపు చూస్తూ చూస్తూ చాలాసేపు కన్నీరు కారుస్తూ వుంది. తర్వాత ఆమెని లేవదీసి తన కన్నీళ్లని తుడుచుకుని తీసికెళ్లిపోయింది.

ఒక వారం గడిచిపోయింది.

స్నేహలత ఓనాడు తన నాన్నగారి దగ్గిరికొచ్చి

"నాన్నా, ఒక లక్షంటే యెన్నుంటాయ్?"

అని అడిగింది.

"చాలా రూపాయిలే వుంటాయ్" అన్నాడాయన.

"అయితే మరి వాటితో పాలవాడి అప్పు తీరిపోతుందా?"

"తీరిపోతుంది."

"కంసాలి డబ్బు యిచ్చేయగలమా?"

"ఓ. యిచ్చేయవొచ్చు."

"అప్పులన్నీ తీరిపోతాయా?"

"యేం, యెందుకు? - నాకు నువ్వు లక్షరూపాయిలు ఇస్తావేంటి." అన్నాడాయన నవ్వుతూ.

స్నేహలత మరేమీ చెప్పకుండా నింపాదిగా అక్కణ్ణించి వెళ్లిపోయింది.

దీపావళినాటిరాత్రి ప్రతీ యింట్లోనూ వరసలు వరసలుగా రకరకాల దీపాలు వెలిగిస్తున్నారు.

"అమ్మా, నేను చెరువొడ్డుని దీపాలు వెలిగించి వస్తానే" అంది స్నేహలత.

"వేగంగా వెళ్లి తిరిగిరా, కాని చూడు ఆ కొత్త చెరువు దగ్గిరికి మాత్రం వెళ్లొద్దు సుమీ - సరే" అంది తల్లి.

ఓ కొత్త రంగు రంగుల చీరె కట్టుకుని ఓ పళ్లెంలో మట్టి ప్రమిదల్లో దీపాలు పెట్టి చెరువొడ్డుకి పయనమయింది. ఆమె కొత్త చెరువు వేపుకే వెళ్లిపోయింది. చెరువులో అప్పటికింకా మెట్లు కట్టించలేదు. మట్టి చెరువు నాలుగువేపులా కుప్పలు కుప్పలుగాపడి కొండలాగా ఎత్తుగా తయారయింది. స్నేహలత చెరువుచుట్టూ దీపాలతో అలంకరించింది. తర్వాత ఆ వొడ్డున ఓ చోట కూచుని ఆమె క్రిందికి చూచింది. చెరువులో నీరు నిండావుంది. నల్లటి నీరు ఆ రాత్రివేళ యింకా నల్లగా కనిపిస్తోంది. చాలా సేపటిదాకా ఆమె రెప్పవెయ్యకుండా ఆ నీటివేపు చూస్తూ వుండిపోయింది. తర్వాత నింపాదిగా నీటిదగ్గిరికొచ్చి నుంచుంది. తన చేతులు రెండూ జోడించి దండంపెట్టి, - "కాళీమాతా" అని టపీమని ఆమె ఆ నీట్లోకి గెంతిపడిపోయింది. ఆ శబ్దంతో వన విహంగాలన్నీ తమ రెక్కల్ని జాలిగా అటుయిటూ ఆడించినై. బెదిరి బేజారెత్తిపోయే మృగాల పాదాల క్రింద నలిగిపోయే యెండుటాకులు చరచరమన్నాయ్. మళ్ళా కాసేపటికి అంతా నిశ్శబ్దమైపోయింది.

క్రమక్రమంగా ఒక్కొక్క దీపమే నిద్రపోయింది. నాలుగు మూలలా యెటుచూచినా చీకటే! సిరాపూసినట్టు నల్లటి గాఢాంధకారమే!

[బెంగాలీకథ ననుసరించి]

# హిందీ మనకి ముప్పే!



శ్రీ ఓరుమళ్ల కామేశ్వరరావు

హిందీని తెచ్చి మననెత్తిమీద పెట్టుకోడం మన దాస్యంకోసమే! హిందూదేశంలోని ముఖ్య భాషల కంటె హిందీ ఏమాత్రము మెరుగు కాదు, పైగా తరుగనికూడ అనేకమంది అభిప్రాయం. హిందీ భాషను మనం, నేర్చుకోడంవల్ల హిందీ వాళ్లకి మనమీద ఒక అసందర్భపు ఆధిక్యతను కల్పించిన వాళ్లమవుతాం.

హిందీ హిందీభాషీయులకు జన్మతో వచ్చిన భాష. మనము కాలంవ్యయం చేసుకొంటేనే కాని రాదు. బ్రతికున్న ఒక భాషకి మనమీద అధికార మివ్వడం ఆ భాషతోపాటు ఆ భాషను మాట్లాడే వారికికూడ అధికార మివ్వడమే! లేదని కొందరు తలలాడించినావాళ్లు చలాయించడం మాత్రం మానరు. స్వేచ్ఛాప్రియమైనదైతే ఆంధ్రజాతి ఇటువంటి అన్యాయానికి ఒప్పుకోదు.

ఆంధ్ర దేశంలో దక్షిణ హిందీ ప్రచారకసభ యొక్క బలం నానాటికి పాపంలాగు పెరుగుతూంది. దీనిని అరికట్టితేకాని మన స్వాతంత్ర్యలతను గొడ్డలిపెట్టు. అప్పుడే హిందీ ఎటువంటి పెత్తనం వహించిందో చూడండి. రైల్వే మంత్రి లాల్ బహదూర్ శాస్త్రిగారు ఇండియా పార్లమెంటులో హిందీలో ఉపన్యసించేరు. హిందీ శిక్షాసమితి అనే ఒక సభ హిందీ వ్యాప్తికోసం ఏర్పడింది. సుమారు పదిహేను లక్షల ధనం ఖర్చుపెట్టి అయిదేళ్లపాటు ప్రచారం చేస్తారుట. తిండి లేక మలమలమాడుతున్న ప్రజల ధనం ఏమోస్తరుగా దుర్వినియోగ మవుతూందో చూడండి. (హిందు పత్రిక తేది 24.5.52 పుట 9) కొన్నికొన్ని కొత్త నిబంధనలను ఏర్పరిచి దక్షిణ హిందూదేశంలోని పాఠశాలలలో హిందీని నిర్బంధంగా నేర్పుతామని విద్యా మంత్రియైన అజాద్ గారు అంటున్నారు. ఇది విద్యగాక అవిద్య! ఇది స్వేచ్ఛాప్రియులైన ఆంధ్రులకు సిగ్గుకలిగించే విషయం. ఇటువంటి హిందీని నేర్చుకోడం మన మర్యాదకే లోపమని భావించండి!

ఈలాగుండగా హైదరాబాదులో ఉస్మానియా విశ్వవిద్యాలయాన్ని హిందీ విశ్వవిద్యాలయంగా మార్చడానికి పండితనెహ్రూగారు తల పెట్టేరు. తెలంగుణావారు మాకువద్దు మొర్రో అన్నా వీరు వినిపించుకోడంలేదు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ఏతొందరలేని నెహ్రూగారికి హిందీమీద ఎంత శ్రద్ధో చూడండి. ఇది ఆయన భాష. ఇది హిందీలకు లాభం! హిందీని మననెత్తిమీదరుద్ది లోబరుచుకోడమే దీని మూలభావం. ఆంధ్రులకు అభిమానముంటే ఇటువంటిపని ఎన్నటికిని జరగదు. ఆంధ్రులు ఆలసతను విడనాడాలి! ఈ దిక్కుమాలిన హిందీని వదలగొట్టుకొనే సూత్రం గమనించాలి!

దక్షిణ భారత హిందీ ప్రచారకసభ మనభాషకి, మన సంస్కృతికి చేసే అపకారానికి మితిలేదు. ఇది ఇంకా ఎక్కువచెయ్య నిశ్చయించుకొంది. రాజమహేంద్రవరంలో హిందీలో ఉన్నత విద్యను ఏర్పరుస్తూంది. ఈ పరిస్థితులలో ఆంధ్రుల కర్తవ్య మేమిటంటే 'మాకు హిందీ వద్దు, ఇక్కడినుంచి దక్షిణ భారత హిందీ ప్రచారక సభను ఎత్తివేసి మమ్మల్ని రక్షించండి' అని గవర్నమెంటువారికి విజ్ఞప్తి చెయ్యాలి. ప్రజలు హిందీని చదవవద్దు. ఆ పరీక్షలకు వెళ్లవద్దు.

అయితే హిందూదేశానికి సామాన్యభాష సంగతేమిటి? తరతరాలనుంచి ఈ దేశానికి సామాన్య భాష సంస్కృతభాష. అటువంటి సంస్కృతాన్ని దిగద్రొక్కి హిందీ ఉన్నత స్థానం ఆక్రమించుకోదలచుకొంది. సంస్కృత భాషకి ఉండే సుగుణాలలో హిందీకి ఒక్క సుగుణమేనా ఉందా? సంస్కృతానికి పరిపూర్ణభాష (Perfect language) అని పేరు. అది అనేక దేశభాషలకి తల్లి. దానిలో ఉండే వాఙ్మయం, విజ్ఞానం సాటిలేనివి. అటువంటి సంస్కృత భాషతో హిందీకి ఈసా! ఇది హిందూ దేశస్థుల అభివృద్ధికి మాత్రం కాదు.

ప్రజలు సంస్కృత భాషా ప్రచారానికి పూనుకొనండి. నేపాలు దేశాన్ని చూడండి. సంస్కృత విద్యాలయాన్ని 13.6.52 నాడు స్థాపించుకొన్నారు. వందలకొద్దీ పాఠశాలలను ఏర్పరుచుకొన్నారు. అదే మోస్తరుగా ఆంధ్ర దేశంలో మనం సంస్కృత విద్యాలయాన్ని స్థాపించాలి. పాఠశాలలలో సంస్కృత భాషను ప్రవేశపెట్టాలి. మనకి రాష్ట్రభాష సంస్కృతమే!



# తిలాంజలి

'విశతి తార చంద్రా
ర్క-పై నేయుగాక''

## పరిచయం

వినోదాపిక్చర్సు భాగస్వామి, మ్యూజిక్ డైరెక్టరు 'ఉమర్ ఖయ్యాం' అను బిరుదు వహించిన 'సుబ్బరామన్' గారి అకాల మరణానికి మా సంతాపమును వెలిబుచ్చుచున్నాము.

వీరు నేటి పిక్చర్లకు సంగీత దర్శకులు, ఇంకా! చిత్రాలకు పాటలు పూర్తి చెయ్యాలి. తమిళ, తెలుగు, కేరళ, కన్నడ దేశాల సినిమా రంగాలకు సిరి అకాల మరణం తీరని నష్టాన్ని కల్గించిందంటూ ఎక్కడ చూచినా ఘంటాపథంగా వాడబడుతుంది. ఆనాటి ఉదయంకూడ ఒక పాటను రికార్డు చేశారటగుండె ఆగిపోకముందే.

1. చూరగొనెనేగ; ముక్తిని! ''సుబ్బరామయ్యకు'' సంగీత మాధుర్య! శోభతోడ
   ఒక్క తనకీర్తి మనకిట! ఒక్క జేసి, అంతలో దోచె ఇంతలో! నస్తమించె!
2. "చుక్కలకు రాజనెడుగర్వ! ముక్కు డంచు చక్కదనమున నీ ముఖ! చంద్రునికిని
   సాటిలేదను" దృష్టితో! పొనగాదె! అంతలోబుట్టె! ఇంతలో! నస్తమింప.
3. హార్మోనియపు రీడులపయి! హాయిగొల్పుచుండెడివి నీదు వ్రేళ్లేన? సూర్యబింబ
   శకలపుహాణుల? సాహితీ! స్వరపుకళల? అంతలో వెల్గి ఇంతలో! నస్తమించె.

రచన:- ప్రొఫెసర్. కె. అంబ

(15-7-1952 నుంచి, 15-8-1952 వరకు)




త్రికాలవేది, జ్యోతిష్చక్రవర్తి, ప్రొఫెసర్ కే. ఆంజి

## మేషం :

జలుబు చెయ్యడంవల్ల చికాకు కొంచెంగ కలుగుతుంది. అతిగా తినమని నిర్బంధిస్తారు, బుద్ధి వికాసానికి మంచి మంచివి చూడడం, చదవడం, వినడం ముఖ్యం, శత్రువులు మిత్రులౌతారు, సర్కస్సులాంటి అత్యద్భుత సాహసాశ్చర్య సంతోష జనకములపై యిష్టం పోతుంది, శత్రుజ్ఞాతి క్షయం, శరీరం చెప్పిన మాటలు విననేరదు, అదృష్టం బాగా కలసి వస్తుంది, లాభంలేని పనిని చెయ్యరు, సన్మానాలు రాగలవు, గొప్పవారి కృపా కటాక్షాలు మిమ్మలను సింహాసనం ఎక్కింపచేస్తుంది, పనికిరాని వాటిల్లోకూడ పదిరెట్ల లాభంకద్దు, క్రొత్త వ్యాపారం, క్రొత్త కార్యజయం కద్దు, ప్రేమలో అసౌఖ్యం సూచనలున్నవి, ధర్మబుద్ధి.

## వృషభం :

కార్యములు వాటంతట అవే అవుతూ వుంటవి, కోపం రానేరాదు, వ్యవహారాల భీతి వుంటుంది, చెక్కింగుల్లాంటివి చిన్నా పెద్దల అధికారాలవల్ల కలుగుతవి, వ్యాపార వృత్తులను సక్రమంగా నడిపించగలుగుతారు, ఆశ్చర్యం కలుగుతుంది, నష్టం రాదు, పనికిరాని వాటిల్లోకూడా వేలాదిగా ధనాన్ని సంపాదించగలరు. అధికార్ల శుభవార్తలు అందుతవి, స్త్రీ పురుష బంధుమిత్ర వృద్ధి, చిన్నలకు అశాంతి పోతుంది, ఈ నెలతో మీకున్న ధనపు కసాలాలు ఇబ్బందులన్ని తీరిపోతవి, అనుకూల వాతావరణం గ్రహాచలనాదులవల్ల మీకు కలుగుతూ వున్నది, సహాయకులు అధికం అవుతారు, క్రొత్త పనులు చేస్తారు, పరువుల చాందినీలుగల వాటిక్రింద పరుండరాదు.

## మిథునం :

అతిగా మాట్లాడడంవల్ల ప్లానులు ముందుగా లోకాని కెగబ్రాకుతూ వుంటవి, స్త్రీ విరోధం కొంత తగ్గుతుంది, భూక్షేత్ర గృహాలాభాలున్నవి, వాహన పశు గోసేవక పరిజనాదులవల్ల శ్రీమంతులౌతారు, నీచుల అవకతవకలవల్ల నష్టం సోకకుండా భగవంతుడు కాపాడగలడు. రాజ ధనం లభించుతుంది, ఆదాయం యినుమడించుతుంది, కొందరు నిష్ఠురాలు మాట్లాడుతారు, ఆరోగ్యం బాగా వుంటుంది, నిద్ర బాగా పట్టదు. క్రొత్త వారిని చూడడం కాని, క్రొత్త అనుకూల వార్తలు వినడం కాని కలుగుతుంది, బుద్ధి వికాసం, మనోరథ సిద్ధి ధైర్యసహాసాదులు మెండు అవుతవి, చిన్నలకు శుభం, చలనం కలుగతుంది.

## కటకం :

పుణ్య క్షేత్రాలపై ఆసక్తి, ధర్మ కార్యాచరణం, మహాత్ములసేవ, అధైర్య విసుగులవల్ల స్వకార్యాలు

చెడుచుకొంటారు, ధనం అంతులేనంత పొందుతారు, విద్యా విఘ్నాలు కలిగినా చివరికి విద్య కొనసాగబడేకాలం, ఇష్టసిద్ధి రాజానుగ్రహం, సల్లాపాలు వింటారు, స్వల్ప రోగ్యం, దొంగలవల్ల కాని, మోసగాండ్లవల్ల కాని ఆస్థి నష్టమయ్యే సూచనలున్నవి, విద్యా వినోద విఖ్యాతుల కేకొరవ వుండనేరదు, డబ్బు కసాలాకద్దు. బంధువ్యయం, విచార వార్తలు రావచ్చు.

## సింహాం:

ఎన్నడు పలుకనివారు తమ సన్నిధి ప్రాంతాలకువచ్చి శరణార్థులౌతారు, అతిమొండితనంవల్ల వున్న విఖ్యాతికి భంగం తెచ్చుకుంటారు, మీకంటే నిపుణులగువారు మీదెబ్బకుజడిసి దెబ్బ తప్పించుకొని మరల దెబ్బ కొట్టడానికి తయారయ్యే ఆలోచనల్లో వున్నారని తెలిసికొని మీరు జాగ్రత్తగా నడవడం అత్యావసరం, అనుకొన్న కార్యాలు అలాగే నడవవు, కాళ్ళకు దెబ్బలు తగలడం కలుగవచ్చు, మెల్లగా నడువడం ఎందుకైనా మంచిదే! ముండ్లు సూదులు వీటివల్ల ప్రమాదాలు రావచ్చు, స్త్రీల చెడ్డతనం తెలుసుకొంటారు, మధ్యమకాలం.

## కన్య:

మిమ్మలను చూస్తేనే మ్రింగుదా మన్నంత దురాలోచనల్లో వుండేది మీవారే! మాయచెయ్యబోయి వారి మాయల్లోపడిపోకండి, మాటలు మధురంగా రానివ్వకపోతే చిన్నలే అవమానింప చూస్తారు, రహస్యాలు దాగనేరవు, నేత్రవ్యాధులు బైటపడవచ్చు, అంతరంగికుల హాని మిత్రద్రోహంవల్ల సమయానికి పనుల సిద్ధికి చాలా ప్రయాసపడవలసి వుంటుంది; మీకు మీపైన్నే అనుమానం కలుగుతుంది, నమ్మదగిన వారిని నమ్మలేరు.

## తుల:

విద్యా వినయ సంపన్నత్వంగల వారని ప్రపంచం మిమ్మలను యిప్పటికి గుర్తించుతుంది, కష్టాలన్ని పోయి సుఖవీధుల్లో సంచరించే కాలమిది, భోగభాగ్యాలకే కొరత వుండదు, రహస్య చరత్వం కూడదు, డబ్బు యిబ్బంది పోతుంది, కర్రలు, ధాన్యాలు, మెరపకాయలు, వస్త్రాలు, పశువులు, భూములు, యిండ్లు వీటిమీద ఆదాయం వస్తుంది, క్రొత్త పనుల్లోకి మిమ్మలను స్వీకరిస్తారు, వ్యయాధిక్యాన్ని తగ్గించుకొందామని యత్నిస్తారు, అది సార్థకం చెందుతుంది, భోజన సౌఖ్యం అధికం, తలనొప్పి, ఉదరశూల, మలబద్ధకాదులవల్ల నలత కద్దు, శత్రుభీతి తరుచు పీడుస్తూ వుంటుంది.

## వృశ్చికం:

పనులు వాటంతట అవే అవుతవి, గెలుపులన్ని లెక్కింప వీలులేదు, చిన్నలకు అసంతుష్టి, వ్యయాధిక్యం, క్రొత్త వ్యాపారానికి పిలుపు వస్తుంది, శ్రమాధిక్యం వ్యవహారాల జయం, వ్యాపారలాభం, ఉల్లాసం, విచిత్ర చిత్రవస్తు ప్రాప్తి, భగవద్భక్తి, విద్యా విశారదత్వం, మనోహరవస్తు లాభం, దివ్య కైంకర్యాలను చేస్తారు, ధర్మపు ధనం మీరు తిన్నారనే అపనిందరావచ్చు, బలహీనత తగ్గుతుంది, రొఖ భారంపైన వుంచుకోరాదు.

## ధనుస్సు:

లోని మర్మం బైటపడుతుంది, కుటుంబవృద్ధి, అసాధ్యాలన్ని సాధింపబడుతుంది, ప్రయాణాలు అర్జెంటు వార్తల సంధిలో చిక్కుకొంటారు, మనస్సు నిలకడ వుండదు, శుభప్రశంస, శుభకార్యాల విషయాల్లో మీ యత్నాలన్ని సానుకూలత నొందుతుంది, చిన్నలకు శుభవ్యయంకద్దు, సంతోషం, శుభవార్తలు వింటారు, ప్రఖ్యాతికద్దు, క్రొత్త అలంకరణాదులపై మోజు, ఇంట్లోవారి విరుద్ధంపోయి సుఖం కలుగుతుంది, ఆరోగ్యాని కేకొరవవుండదు, శత్రుపోటీ జయం, దెబ్బలు తగలకుండా కాపాడబడుతారు, అనుమానాలు పోతవి, నిద్రలు సాగవు, అధికధనం వస్తుంది, కోపం అధికం అవుతుంది, అతిగా మాట్లాడరాదు.

(385 పేజీలో చూడుడు)

# లోక వార్తలు

మద్రాసు ప్రభుత్వము క్రొత్తగా విధించనున్న పన్నులలో మోటారు స్పిరిట్సుపై అమ్మకం పన్నును గాలన్ 1-కి 0.2.0 వంతున హెచ్చించబడుతుందనియు, కొత్త ఇర్రిగేషన్ ప్రాజక్టుల ప్రాంతములలో అభివృద్ధి పన్నులు విధించబడుతవనియు, రాబడి ఎక్కువయ్యేటట్లుగా యిప్పటి అమ్మకం పన్ను విధానాన్ని మార్పుచెయ్యబడుతుందని వార్త.

◆ ◆ ◆

డా. పట్టాభి సీతారామయ్యగారు మధ్య రాష్ట్రి గవర్నరుగా నియమించబడిరి.

◆ ◆ ◆

తెలంగాణాలో అరాజక చర్యలు జరుపుటకు కమ్యూనిష్టులకు రష్యా ప్రభుత్వం ఏటా 64 లక్షల రూపాయలు సహాయం చేస్తున్నదట. తెలంగాణా కమ్యూనిస్టులు విదేశ కమ్యూనిస్టులతో వైర్లెస్ ద్వారా ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నారట. ఈ విషయాలు హైదరాబాద్ శాసన సభలో బయటపడినవి.

◆ ◆ ◆

ఈ మధ్య జరిగిన జనరల్ ఎన్నికలలో తమిళనాడు కాంగ్రెస్ అధ్యక్షుడు డా. సుబ్బరాయన్, ఆయన భార్య, కుమారుడు మోహన్ కుమారమంగళం, ఓడిపోయారు. మొన్న జరిగిన ఉప ఎన్నికలలో ఆయన కుమార్తె పార్వతి కోయంబత్తూరు నియోజకవర్గంలో పరాజయం నొందింది.

◆ ◆ ◆

నెల్లూరునందలి కస్తూరిదేవి విద్యాలయంవారు చేతిపనులు, లలితకళల శాఖను స్థాపించ నుద్దేశించియున్నారు. అందుకుగాను సుప్రసిద్ధ సినిమా నటుడు శ్రీ వి. నాగయ్య ప్రభృతులు ఉచిత కళా ప్రదర్శనములిచ్చి విరాళముల సేకరణకుగాను అంగీకరించిరట. ఈ శాఖలను ఆగష్టు 15-వ తేదినుండి ప్రారంభించ సంకల్పము.

◆ ◆ ◆

నెల్లూరు జిల్లాలో కోవూరు తాలూకా బొడ్డువాని పాలెం రైతు శ్రీ కాటంరెడ్డి రామిరెడ్డిగారికి ఒక్క ఎకరమునకు 4 పుట్ల ధాన్యము పండించినందుకుగాను జిల్లా కలెక్టరు 100 రూపాయలను బహూకరించారు.

◆ ◆ ◆

అమెరికాలో నూటికి 97. 7 మంది స్త్రీలు విద్యావంతులైనట్లును, పురుషులలో నూటికి 97.0 మంది విద్యావంతులున్నట్లు 1947 సం॥ము సేకరించబడిన వివరములనుబట్టి తెలుస్తున్నది.

◆ ◆ ◆

1951 సం॥ము సేకరించబడిన లెక్కలనుబట్టి అమెరికాలో 100-కి 64 మంది స్త్రీలు ఉద్యోగాలలో నున్నట్లు తెలుస్తున్నది.

◆ ◆ ◆

చింతగుంట పాలెం (బందరు)లో శ్రీ కృష్ణరాయ గ్రంథాలయ వార్షికోత్సవ సందర్భమున కృష్ణాపత్రికా

సంపాదకులుగా నుండిన శ్రీ ముట్నూరు కృష్ణారావు గారి సతీమణి రుక్మిణమ్మగారి మరణమునకు సంతాపం వెల్లడించిరి.

♦ ♦ ♦

హిమాలయ పర్వతాలలో 14 వేల అడుగుల ఎత్తుగల ముక్తిపాడ్ ప్రాంత్యమున 20 కోట్ల సంవత్సరములనాటి నత్తగుల్ల దొరకిందట. దానినిబట్టి హిమాలయా ప్రాంతమంతా ఒకానొకప్పుడు సముద్ర ప్రాంత్యముగా నుండియుండాలని ఇటీవల ఎవరెస్టు శిఖరాన్ని ఎక్కడానికి ప్రయత్నించిన స్విస్ పర్వతారోహకుల అభిప్రాయము.

♦ ♦ ♦

అస్సాం రైఫుల్స్ ఆఫీసులోని ఒకఅధికారి తన క్రింద ఉద్యోగి తనకు కూతురునిచ్చి పెండ్లి చేయవలసిందని కోరగా దానికతడు నిరాకరించాడట. అందుకని ఆ ఉద్యోగిని బర్తరఫ్ చేయ సమకట్టగా గవర్నర్ జోక్యం కలుగజేసుకొని న్యాయం కలుగజేశాడట.

♦ ♦ ♦

ఖద్దరు, చేనేతవస్త్రపరిశ్రమల అభివృద్ధికి ప్రత్యేక సంఘం నియమింపబడగలదని కేంద్రమంత్రి కృష్ణమాచారిగారు ప్రకటించారు.

♦ ♦ ♦

కృష్ణానదిపై ప్రాజక్టుల విషయంలో ఆంధ్రులకు అన్యాయం జరుగదని కేంద్రప్రభుత్వ మంత్రి శ్రీ గుర్జీలాల్ నందా హామీయిచ్చాడు.

♦ ♦ ♦

మద్రాసు నగరంలో మురికిగూడెముల అభివృద్ధికి మైసూరు బ్యాంకినుండి 15 లక్షల ఋణము బడయుటకు కార్పొరేషను సభవారు ప్రత్యేక సమావేశంలో తీర్మానించారు.

♦ ♦ ♦

మద్రాసు ప్రభుత్వము జరిపే అన్యాయాలే ఆంధ్రుల రాష్ట్రవాంఛకు కారణమని పార్లమెంటులో కాంగ్రెస్ సభ్యుడు కొత్త రఘురామయ్యగారు విమర్శించారు.

బ్రిటిషు ప్రభువంశాలలో ప్రముఖ వంశానికి చెందిన మర్క్విస్ వించెస్టర్, మిస్ బాసీపాట్రీ అనే పార్శీ స్త్రీని వివాహమాడాడు. వధువుకు 50 ఏండ్లు; వరునకు 90 ఏండ్లు.

♦ ♦ ♦

గుంటూరు శారదానికేతనపు పరిపాలన సక్రమంగా జరుపుటకు శ్రీ మునగాల రాజాగారి అధ్యక్షతన తాత్కాలిక కమిటీ నియమించబడింది.

♦ ♦ ♦

మైసూరు రాజ ప్రముఖ్ కోయంబత్తూరులో ప్రసంగించుచు భారత దేశానికి అధమపక్షం 10 లక్షల సుశిక్షితులైన మంత్రసాను లవసరమని చెప్పారు.

♦ ♦ ♦

1951-52 సంవత్సరములో ఆదాయ పన్నువల్ల 185 కోట్ల రాబడి వచ్చినది. ఇంత రాబడి యింతవరకెన్నడూ రాలేదట.

♦ ♦ ♦

స్త్రీలనుకూడ సైన్యంలో చేర్చడానికి ఫ్రాన్సు దేశం ఆలోచిస్తున్నదట.

♦ ♦ ♦

ఒరిస్సారాష్ట్ర డిప్యూటీ ఆరోగ్యమంత్రి వసంత మంజరీదేవి అసెంబ్లీలో తన ఫైలును ఆవృతిని వేసిందని చెప్పింది.

♦ ♦ ♦

ప్రపంచ అందాల రాణిగా ఫిన్లెండు సుందరి ఆర్మీకూసెల ఎన్నుకోబడింది. ఈమె వయస్సు 18 సంవత్సరములు. ఈమె అందాన్ని చూచి సమావేశమయిన వారు దిగ్భ్రాంతులైనారట. ఎన్నిక అయినట్లు ప్రకటించబడగానే ఆ సుందరికి నోటివెంట మాట రాలేదట.

♦ ♦ ♦

ప్లానింగ్ కమీషన్ సభ్యురాలుగా నియమించబడిన శ్రీమతి దుర్గాబాయ్‌గారు స్త్రీ శిశువుల యోగక్షేమాలు, ఆరోగ్యం, విద్య, సామాజిక శ్రేయస్సు, ప్రజా సహకారములను పర్యవేక్షిస్తారు.

మలలు మలబద్ధకమువల్ల యేర్పడు తీవ్రమయినబాధ, సలుపు, నొప్పి, వాపు కలుగు చుండును. ఆపరేషన్ వైద్యమువరకు మనలను పంపుచున్నవి. అందులకు మంచి చికిత్స యొకటి కలదు. ఖర్జూరపు విత్తనములను చూర్ణము కావించి అవసరమయిన శరీరభాగమునకు పొగవేసిన శాంతించును. కొంతకాలమువరకు యిట్లు వాడిన మరలరావు.

జ్వర తీవ్రతకు తాళలేక తందర, శోష, నరముల ఈడ్పు కొందరికి కలుగును. అట్టిసమయములో తమల పాకులో వేయు సుగంధ ద్రవ్యములతో ఖర్జూరపుకాయ గంధమును తమలపాకునకు రాచివేసుకొన్న సమత్వమునకు వచ్చును. జ్వరము తగ్గును. ఖర్జూరపు పండ్లను వేడినీళ్లలోవేసి బాగుగ మరగనిచ్చి అరిషము తయారొనర్చి సేవించిన ప్రమేహములు పోవును.

ఇంతముఖ్యమయిన పండ్లు కావుననే శుభ కార్యములయందు వివాహసమయముల మనయిండ్లలో వాడుకొనుచుందుము. యజ్ఞములయందు, వ్రతములయందు మహాపవిత్రముగ వాడబడు ఫలములలో నిది యొకటి. ఆరోగ్యమునకు, అందమునకు, ఆనందమునకు తగినఫలము.

---

(381 పేజి నుండి)

మకరం:

ఇల్లు చక్కబెట్టుకొంటారు, బంధు సన్మానం, విద్యా వినోద విలాసం, కార్యసిద్ధి, నిలచిపోయిన పనులన్ని మరల అరంభింపబడి సానుకూలత చెందుతూ వుంటవి, మీ ప్లానుల కడ్డు అనేది వుండనే వుండదు, రత్నాభరణ గ్రంధయంత్ర పరికర సామగ్రీలవృద్ధి, భూక్షేత్ర గృహాభివృద్ధి, జయ లాభం, ఆరోగ్యాల కేకొరవ వుండదు, ఇతర్లవల్ల తప్పుత్రోవల్లోకి మనస్సు లాగింపబడుతుంది, అధర్మాదులు చేయుట తగదని హృదయం బోధిస్తున్నా మీరు వినక చేస్తారు, తాత్కాలితం నష్టహేతువు కల్గింమతుంది.

కుంభం:

ఇదివరలోవున్న యిబ్బందులన్ని క్రమక్రమంగా వదలిపోయి జయలాభం అనుకూలాదులను పొందుతారు, శత్రువులు రాజీపడ చూస్తారు - మీతో! దూరదేశాలకు ప్రయాణ సూచనలున్నవి, క్రొత్త వ్యాపారంచేసి లాభం పొందుతారు, రోఖం పెంపొందుతుంది, విచిత్రంగా పైకివచ్చే సహాయాలు మీకు భగవత్సహాయంవల్ల యేర్పడుతుంది, స్త్రీల ధనం రావచ్చు, ప్రఖ్యాతి ప్రాకిపోతుంది, వృత్తి వ్యాపారాలు పునరుద్ధరింపబడి లాభాన్ని యిస్తవి, సన్మానాలు పొందుతారు, నిర్వ్యాపారత్వం తగ్గుతుంది, పుస్తకాలు రచనలు బాగుంటవి, మీకల్పనా ధోరణి దివ్య ప్రసంగం ప్రజలకు ఆనందాన్ని యిస్తుంది.

మీనం:

ధనానికి ఏకొరవ వుండదు, చిన్నాపెద్దల అనుకూలములు, దూరం వెళ్లినవారు మీకోసం మరల మీవద్దకే చేరుతారు, అన్యదేశలాభం, పర్వతారోహణం లాభాన్ని నూరురెట్లు పెంచుతుంది, లాటరీ పజాల్సు రేసు వ్యాపారాల్లో అఖండజయం, భూవ్యవసాయ కృషుల్లో అధికంగా లాభంకలిగే సూచనలు తెలుసుకొంటారు, ఋణరోగ శత్రుభయం వుండదు, మహాత్ములను, గురువులను చూస్తారు, సద్బోధలు వింటారు, నవీనుల చెల్మివల్ల పనులు తేలికగా అవుతవి, ఆకస్మికంగా ఆదాయం రాగలదు, బహుజన పోషకత్వం చెయ్యడం తగదు. రెష్టు ముఖ్యం.

——(0)——

# అమ్మా! పిల్లా!!

కుమారి సి. ఎ. లీల

రాత్రి 10 గంll లయినది. టాక్సీలో బయలుదేరి అశోక్ స్టేషనుకు చేరుకున్నాడు. 10-45 గంటలకు బండివచ్చి ప్లాటు ఫారం మీద ఆగింది. ఒక పెట్టెలోనుండి ఒకయువతి గబగబ దిగి వెళ్లిపోయింది. ఆసందట్లో ఆమెచేతినుండి ఒకపుస్తకము జారి ప్లాటుఫారంమీద పడింది. దానిని తీసికొని అశోక్ ఆబండిలో ఎక్కిన రెండునిముషాలకు బండికదిలింది.

బండిలో అశోక్ ఆదొరకిన పుస్తకమును చదువుతూ కాలం గడిపాడు. చక్కని నవల. రచయిత్రి 'శశి', బహుశ బండిదిగి వెళ్లిన ఆమెయే రచయిత్రి అయియుంటుందేమో ననుకున్నాడు. రైలు బండి మద్రాసు చేరింది.

కొంతకాలానికి అశోక్ ఆ గ్రంథము నందుగల రచయిత్రి చిరునామకు యిలా జాబు వ్రాశాడు.

శ్రీ 'శశి' గారికి

మీరు మొన్న శుక్రవారమునాడు రైలు దిగి వెళ్లేసందర్భమున ప్లాటుఫారము మీద జారవిడిచి వెళ్లిన గ్రంథమును చదువటం తటస్థించినందుకు క్షమించచవలెను. అందలి రచన చాల మృదు మధురముగా నున్నది. నేను కూడ కొన్ని నవలలను రచించినాను. వానిని మీకు పంపుచున్నాను. వానిని చదివి మీయభిప్రాయమును తెలుపవలెను.

ఇట్లు
అశోక్

కొంత కాలమునకు 'శశి' ఒక జాబు వ్రాస్తూ అశోక్ వ్రాసిన గ్రంథములు చాల బాగుగా నున్నవనియు, తరచుగా జాబులు వ్రాస్తుండవలసినదిగా కోరింది.

ఈవిధముగా క్రంమంగా వారి పరిచయము అభివృద్ధిగాంచుచుండింది.

అశోక్ తలిదండ్రులు అతడికి పెళ్లిచేయాలని ఒకసంబంధమును చూచి పిల్లను చూచి వెళ్లడానికి రమ్మని జాబు వ్రాశారు; కాని అశోక్ మనస్సంతా 'శశి'ని చూచిన నాటినుండి, ఆమెతో జాబుల మూలంగా పరిచయము ఏర్పడినప్పటినుండి ఆమెను వివాహ మాడాలని యుండేది. కాని శశి తన్ను వివాహ మాడుతుందని ఎలాగనుకోగలడు? తన తల్లిదండ్రుల మాట త్రోసివెయ్యలేక వెళ్లి ఏవోవంకలు చెప్పి పిల్ల నచ్చలేదని చెప్పి తిరిగి వచ్చాడు.

కొన్ని నెలలు గడచింది. అశోక్‌కు శశి దగ్గరనుండి వచ్చిన జాబులో యిలాగున్నది.

శ్రీ అశోక్ గారికి !

నేను ఎల్లుండి మద్రాసులో నుంటాను. సాయంకాలము తీరిక చేసుకొని మీరు నన్ను సముద్రతీరమున కలసికోగలరని నమ్ముచున్నాను, బహుశ నన్ను పోల్చగలరో

లేదో - పసుపుపచ్చ చీర, తెల్ల జాకెట్ తలలో గులాబి పూవులతో నుంటాను. శెలవు.

ఇట్లు
శశి.

అశోక్ పరమానంద భరితుడయినాడు. ఆమె వ్రాసిన ప్రకారం సాయంకాలం సముద్రతీరానికి చేరుకున్నాడు. వేయి కండ్లతో అశోక్ శశి కొరకు వెదకాడు. కాని లాభం లేకపోయింది. చివరకు శశి వ్రాసిన ఉత్తరములోని పోలికలతో వికృతాకారపు వ్యక్తి సాక్షాత్కరించింది. అశోక్ విభ్రాంతి పడ్డాడు; తానానాడు చూచిన ఆమెకు, యీనాడు తనకు కనుపిస్తున్న ఆమెకు ఏమాత్రము పోలికలు లేవు. తలవంచుకొని యింటిమొగం పట్టాడు అశోక్.
మరునాడు తండ్రిస్వయంగా వచ్చి పెండ్లి సంబంధము నిశ్చయించుకోడానికి అశోక్‌ను వెంటబెట్టుకొని వెళ్లాడు.

పిల్లను పిల్లవాడు, పిల్లవాడు పిల్లను చూచుకున్నారు. తమ గ్రంథముల మూలంగాను, జాబుల మూలంగా వారుభయులు చిరపరితులే, పైగాశశిని స్వయంగా అశోక్ ఆనాడు ప్లాటుఫారం మీద చూచాడు. అశోక్‌కు సంతోషానికి మేర లేదు. శశి అశోక్‌ను మనసార ప్రేమించింది. వారిద్దరికీ వైభవంగా వివాహం జరిగింది.

అది సంధ్యాసమయం. సూర్యకిరణాలు క్రమంగా చల్లబడుతున్నవి. అశోక్, శశి సముద్ర తీరాన నడిచి వెళుతున్నారు. సముద్రపు టలలు వారిని చూచేమో నన్నట్లు పలుమారు వాళ్ల కాళ్లను తడుపుతున్నవి.

“లతా! నీపేరు ‘శశి’ అని అబద్ధాలు వ్రాశావెందుకు? పైగా నీపుస్తకంమీద కూడ ‘శశి’ యనే ముద్రింప చేశావు” అన్నాడు అశోక్.

లత “మా అమ్మ పేరు ‘శశి’ ఆమె మీదగల ప్రేమ కొద్దీ ఆపేరును నేను వ్రాసిన గ్రంథములలో వాడుకొంటున్నాను” అన్నది.

“మరి మద్రాసుకు వస్తానని చెప్పి వ్రాసి, ఆనాడు సాయంకాలము బీచికెందుకు రాలేదు” అని అడిగాడు అశోక్.

“నిజానికి ఆనాడు మద్రాసులోనే యున్నాను కాని మిమ్ములను ఏడిపించాలని దాసీదాన్ని నేనువ్రాసినట్లు సింగారించి బీచికి పంపాను - దొరగారికి పాపం! కోపం రాలేదు గదా” అన్నది అతని మొగం చూస్తూ.

“అమ్మా! పిల్లా!!” అన్నాడు అశోక్.

సూర్యుడు ప్రశాంతంగా పడమర దిశన మరుగుపడి పోయాడు.

# స్త్రీలకు విద్య ఎలా ఉపయోగపడాలి?

● శ్రీమతి చివుకుల లక్ష్మీకాంతమ్మ ●

స్త్రీల విద్యాభ్యాసమును గురించి ప్రజలలో వివిధాభిప్రాయములున్నవి. ఆడదానికి చదువులెందుకు? వంటయింటిలో పడియుండి పిల్లలను కంటూ పతినే దైవముగా సేవించడమే స్త్రీ ధర్మమనేవారు కొందరు, కొందరు చాకలిపద్దు వ్రాయగలిగే చదువుంటే చాలనేవారు మరికొందరు, చదువుకొని ఉద్యోగాలు చేస్తూ పురుషులతో సమానంగా టీకు టాకుగా తిరగాలనేవారు. పై అభిప్రాయము లందలి సాధక బాధకములను మనసునందుంచుకొని విద్యావంతులైన స్త్రీలు ఉద్యోగాలను, టీకు టాకులను, ప్రధానంగా నెంచక తమ విజ్ఞానాన్ని కుటుంబ శ్రేయస్సుకు, సంఘ శ్రేయస్సుకు వినియోగ పర్చాలనేవారు కొందరు.

మొదటి రెండు తెగలవారి ఉద్దేశాలు సవ్యమైనవికావు. బాధ్యతను తెలిసికొనుటకుగాని, నిర్వహించుటకుగాని, విద్య యవసరం. దానిని గుర్తించలేని కుటుంబాలలో సౌఖ్యము చాల తక్కువ.

చదువుకొని, పాశ్చాత్య నాగరికతను దృష్టిలో నుంచుకొని, కుర్చీల మీద కూర్చొని ఉద్యోగాలుచేస్తూ టీకు టాకుగా తిరగాలనేవారు దేశకాల పరిస్థితులను అర్థముచేసుకొనని వారు. పాశ్చాత్య దేశములలో రాబడి అధికం; జనాభా తక్కువ. అందువలన పురుషులతోబాటు స్త్రీలు అన్నిపనులు చేయవలసిన అవసరం ఉన్నది. అందుకుగాను తమకుటుంబ వ్యవహారముల నిర్వహణకు జీతగాండ్లను నియమించుకోడానికి అవకాశమున్నది. మనదేశంలో పరిస్థితులు అవికావు. చాలా బీద దేశం; బహు జనాభా కలది. రాబడి చాల తక్కువ. అందువలన, ప్రతిపనిని, పురుషునితోబాటు, స్త్రీ చేయ నవసరములేదు. రాబడి కొద్ది కాబట్టి స్త్రీ పురుషు లిద్దరు, ఉద్యోగములు తలపెట్టినచో కుటుంబ నిర్వహణకు, జీతగాండ్లను, నియమించుకో కలిగే అవకాశము లేదు. కాబట్టి కుటుంబ ఆర్థిక పరిస్థితులను అర్థము చేసుకొని, కుటుంబ పోషణకు సహకరించగల, విజ్ఞానము ప్రసాదించగల విద్య హిందూ స్త్రీకి చాల అవసరం.

మన దేశంలో వైద్యసహాయం చాల తక్కువనే చెప్పాలి. ప్రజలలో వైద్యవిజ్ఞానము తక్కువగుటచే, ఆరోగ్య లోపములు విరివిగా నున్నవి. మన యిండ్లలో ఆహార లోపములు కలవు. దీనివలనకూడ ఆరోగ్యమునకు, లోటు కలదు. ఇట్టి పరిస్థితులలో, విద్యావంతులైన స్త్రీలు, ఆహారములోని, లోటుపాట్లను దిద్దుటకును, వైద్య విజ్ఞానమును సంపాదించుకొని దానిని సంఘ శ్రేయస్సు కొరకుపయోగించుటకును, తమ విజ్ఞానము నుపయోగించ వచ్చును. లలిత

కళల నభ్యసించుటకు విద్య ఎంతైన అవసరము. గృహపరిశ్రమల అభివృద్ధికి స్త్రీలు విస్తారమైన కృషిచేయుట కవకాశమున్నది.

మన దేశంలో, స్త్రీలు పోలీసులుగా, సైనికులుగా, పనిచేయవలసిన అవసరంలేదు. అనేక మంది పురుషులు నిరుద్యోగులై తిరుగుచుండ, అట్టి ఉద్యోగాలకు స్త్రీలు ప్రాకులాడుట వాంఛనీయము కాదు; అవి మన స్త్రీ సమాజమునకు తగినవి కావు.

పసిపాపలకు, విద్యా బోధనను స్త్రీలు కడుసమర్థతతో నిర్వహించగలరు. అందువలన బాల బాలికలు, ఆదర్శవంతమైన ఉత్తమ పౌరులుగా తయారు కాగలరు.

రష్యాజోటి పాశ్చాత్యదేశాలలో స్త్రీలు కూడ వ్యవసాయమును సమర్థతతో నిర్వహించుచున్నారు. మన దేశంలో అంతశ్రమపడ నవసరము లేదుకాని, పండ్లు, కూరగాయలు, నూతన పద్ధతులలో విరివిగా పండించుటకు తమ విజ్ఞానము నుపయోగించవచ్చును.

పై అనేక విధాల, విద్యావంతులైన స్త్రీ తన విజ్ఞానమును, దేశ శ్రేయస్సు కొరకు వినియోగించవచ్చును. అందువలన సమాజంలో, స్త్రీకి ఉత్తమస్థానము కూడలభించగలదు.

ఈవిషయాలను మనస్సు నందుంచుకొని స్త్రీ విజ్ఞాన వికాసాలను వృద్ధి చేసుకొనుట ఆదర్శనీయము.

---



ఒకఫిలిం ప్రొడ్యూసరు తను తీయనున్న చిత్రానికి నటీనటుల నెంచుకొనే సందర్భమున ఒక అమ్మాయితో "మీరు అన్నివిధముల మాకు నచ్చారు. మీ కంఠస్వరం, అంగసౌష్టవము మా యభిప్రాయముల కనుగుణ్యంగా నాయకురాలి పాత్రకు తగియున్నవి. అయితే మీకు జీతం ఎంత కావాలో చెప్పండి" అని అడిగాడు.

ఆ యమ్మాయి తనకు సమ్మతమయిన జీతమును కోరింది.

"క్షమించండి; మీరు చాల పొడుగుగా నుండటంవలన మా చిత్రంలో నటించడానికి ఉపయోగపడరు" అన్నాడు ప్రొడ్యూసరు.

—(0)—

## గమనిక

'రాష్ట్రభాషగా సంస్కృతము' అనే శీర్షిక క్రింద మీ అనుకూల ప్రతికూల యభిప్రాయములను క్లుప్తముగా వ్రాసి పంపితే ప్రచురిస్తాము.

సంపాదకుడు




**శ్రీ ప్రకాశంగారి జీవితచరిత్ర: శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారు. ప్రకాశకులు వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండు సన్సు, 292 ఎస్ప్లనేడు, మద్రాసు 1. వెల 0-12-0**

ఇందులో ఆంధ్ర కేసరి జీవితమునందలి వివిధ ఘట్టములు చక్కగా వివరించబడినవి. గ్రంథకర్త శ్రీ ప్రకాశంగారితో సన్నిహిత సంబంధ పరిచయములు గలవారగుటచే కడుసమర్థతతో యిందలి విషయములను సేకరించకలిగారు.

ప్రకాశంగారు ప్రజానాయకుడు, సేవకుడు. అందువలననే ప్రజల ఆదరాభిమానములకు విశేషముగా పాత్రుడైనాడు. ఆంధ్రరాష్ట్రోద్యమంలోను, భారత స్వాతంత్ర్య సమరమునందు ఆయన నిర్వహించిన పాత్ర, చేసిన త్యాగాలను, ధైర్యసాహసాలను, ప్రజలు ఎన్నడు మరువరు. అట్టి మహనీయుని జీవిత చరిత్రను ఆయనతో తనకుగల పరిచయాన్ని పురస్కరించుకొని శాస్త్రిగారు యీ చిన్న గ్రంథాన్ని వ్రాయడం హర్షించతగినది.

ఇందు ప్రజాసామాన్యానికి తెలియని విషయాలను వ్యక్తపరిచే విషయాలు, అనుబంధాలున్నవి.

ప్రకాశంగారి ధైర్యస్థైర్యాలను, త్యాగసేవాసక్తిని, కార్యదీక్షను, ప్రబోధించేవారి జీవితము యీ గ్రంథముద్వారా ప్రజా సముదాయానికి మార్గదర్శకమగుగాక!

**ప్రభాతసేవ: శ్రీ సీతారామనామ సంకీర్తన సంఘం (రిజిస్టర్డు,) గుంటూరు వెల 0-8-0**

ఇది భక్తిరస ప్రధానమయిన గ్రంథము, ఇందలి పద్యములు, పాటలు తన్మయత్వంతో భగవత్సేవ చేయువారికి ఉద్దేశించబడినవి. భజన పరులు, భక్తులు యీగ్రంథాన్ని విశేష భక్తి శ్రద్ధలతో స్వీకరిస్తారనడంలో సందేహంలేదు.

---

(391 పేజి నుండి)

భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణవాదము ఎంత సమంజసమయినదో హైదరాబాదు విభజనకూడ అట్టిదే. ఆర్థిక, రాజకీయ, సాంఘిక అభివృద్ధులతోబాటు తమ భాష, సంస్కృతుల అభివృద్ధుల దృష్ట్యా భాషా ప్రాంత్యాలు విడిపోయి తమ అయాసోదర భాషా ప్రాంత్యపువారితోచేరి పోదలచడం సమంజసం కాదనలేము. పరిపాలనా సౌలభ్య దృష్ట్యాకాని, తమ వివిధ క్లిష్టసమస్యల పరిష్కార దృష్ట్యాకాని యీ వాంఛ, ఆందోళన న్యాయసమ్మత మయిందే.

అయితే ప్రధాన మంత్రి హైదరాబాదు విభజించబడి ఆంధ్రభాషా ప్రాంత్యాన్ని మద్రాసు రాష్ట్రమందలి ఆంధ్ర ప్రాంత్యముతో కలిపితే ఏర్పడే రాజకీయ పరిణామాలను గురించి శంకించుచుండవచ్చును. ప్రజల సమస్యలను అర్థముచేసికొని వాని పరిష్కారానికై శక్తివంచనలేకుండా ప్రజాశ్రేయస్సు దృష్ట్యా కేంద్ర ప్రభుత్వము కృషి చేసినంత కాలము యిట్టి శంకల కవకాశముండదు,

ఏనాటికైనా భాషా ప్రాంత్యాల విభజన అత్యవసరం. సమయం ఆసన్నమయినప్పుడు వానిని ప్రజలే సాధిస్తారు. దీనిని గుర్తించి ప్రభుత్వము పూనుకొని భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణానికి పూనుకోడం క్షేమకరం.

—(o)—

# సంపాదకీయములు

## రాష్ట్రభాష - హిందీ

రాష్ట్రభాషగా ఇంగ్లీషు స్థానంలో హిందీ నిర్ణయించబడింది. కాని తర్జన భర్జనల పరంపరలు సాగుతూనే యున్నవి. ముఖ్యంగా దక్షిణ దేశంలో కొందరు హిందీని బరువుభారంగానే భావిస్తున్నారు.

హిందీ ఉత్తమమయిన భాషయే కావచ్చును. అదిదలి వాఙ్మయము రసవంతమయినది కావచ్చును. కాబట్టే దక్షిణదేశంలో విరివిగా హిందీ నభ్యసించారు; అభ్యసిస్తున్నారు. అంత మాత్రంచేత ఈ భాషకు, ఒక్క దానికితప్ప మరేదానికి రాష్ట్రభాషయగు యోగ్యత లేదనేవాదం సవ్యమయిందికాదు. దానికంటే ఉత్తమమయింది, జాతీయాభ్యుదయానికి సర్వవిధాల తోడ్పడగలట్టి సంస్కృతమును నిర్లక్ష్యము చేయడం విచారకరమైన విషయం.

భారతజాతీయ సంస్కృతికి, సాంప్రదాయాలకు, ఆచారాలకు సంస్కృత వాఙ్మయమే ఆధారం. తెలుగు, మలయాళం, కన్నడం మొదలగు దక్షిణదేశ భాషలకు సంస్కృతము విశేష సంపదను సమకూర్చింది. ఈ నాడు తమిళంలాంటి భాషలు సయితము సంస్కృత భాషతో సంబంధము లేకుండా అభివృద్ధి గాంచుచున్నవని చెప్పలేము. ఇక హిందీ, బెంగాలీ మొదలగు ఉత్తర హిందూస్థానపు భాషలకు సంస్కృతము మాతృక. అంటే సంస్కృత భాషా పరిచయంతో మిగిలిన అన్ని హిందూదేశపు భాషలను అవగాహనము చేసికోవచ్చును. సంస్కృతభాషాభ్యాసమూలంగా వివిధ ప్రాంతీయ భాషలు వర్ధిల్లుతవి కాని వానికెట్టిముప్పు వాటిల్లదు.

జాతీయ, అంతర్జాతీయ దృష్ట్యా సంస్కృత వాఙ్మయమునకుగల గౌరవ ప్రతిష్టలు జగద్విఖ్యాతం. ఈ భాషయడల అంతర్జాతీయంగా ఆసక్తి చూపుతుంటే మనము నిరాదరణగా చూడడం మన శ్రేయస్సు కుపకరించదు.

సంస్కృతభాషాభ్యాసం కష్టతరమైనదని నిరాకరిస్తే ఆ వాదం చాల బలహీనమయింది. ఈ నాటి మన ఉనికికి, అభ్యున్నతికి సంస్కృత వాఙ్మయమే కారణమను విషయం మరువరానిది. చాణక్యుడు అర్థశాస్త్రాన్ని సంస్కృత భాషలో రచించాడంటే ప్రభుత్వ కార్యకలాపాలకు సయితము సంస్కృతము ఉపకరిస్తుందని నిదర్శనము.

మనజాతీయ గౌరవ ప్రతిష్ఠలను రాణింపజేసికోడానికి హిందీకంటే సంస్కృతము రాష్ట్రభాషగా నుండతగింది. ఈ విషయమును ప్రభుత్వము, ప్రజలు గుర్తించి సంస్కృత భాషకు తగుప్రోత్సాహ మిస్తారని మా ఆశ.

## భాషాప్రయుక్త రాష్ట్రాలు - హైదరాబాదు విభజన

భారత ప్రధాన మంత్రి పండితనెహ్రూ అంతటి విశాల హృదయుడు హైదరాబాదును భాషా ప్రాంత్యాలుగా విభజించితే దక్షిణాపథమంతా తారుమారగుతుందనడం శోచనీయము.

(390 పేజిలో చూడుడు)

## శ్రీ నందననామ సంll ఆషాఢ-శ్రావణమాసములు.

1952 సంll జూలై నెల

| | | |
|---|---|---|
| 16 | బు | ద 44-11 భ 26-8 రా 24-49 దక్షిణాయన పుణ్యకాలం |
| 17 | గు | ఏ 44-19 కృ 27-40 అమృతయోగం |
| 18 | శు | ద్వా 45-37 రో 30-22 ది 9-24 ఉభయప్రదోషం |
| 19 | శ | త్ర 47-59 మృ 34-9 రా 24-53 శనిత్రయోదశి |
| 20 | ఆ | చతు 51-1 ఆర్ద్రా 38-51 మాసశివరాత్రి |
| 21 | సో | ● అమా 55-10 పున 44-14 త్యా 4-22 అమసోమవారవ్రతం |
| | | శ్రావణమాసం |
| 22 | మం | శుద్ధపాడ్యమి 59-33 పుష్య 50-5 ది 6-4 కుజగౌరివ్రతారంభం |
| 23 | బు | విదియ 60-10 ఆశ్రే 56-9 ది 25-14 చంద్రోదయం |
| 24 | గు | విదియ 4-3 మ 60-10 ది 29-4 త్యా 4-21 |
| 25 | శు | త 8-22 మ 2-0 వ 39-14 ది 23-54 నాగచతుర్థి |
| 26 | శ | చ 12-19 పూ.ఫ 7-33 భ 12-19 ది 27-4 శనివారవ్రతారంభం |
| 27 | ఆ | పం 15-32 ఉ.ఫ 12-27 రా 3-6 నాగపంచమి |
| 28 | సో | ష 17-56 హ 16-29 రా 5-44 త్యా 4-12 |
| 29 | మం | స 19-15 చి 19-31 రా 2-13 శుక్రమౌఢ్యమిరహితం |
| 30 | బు | అ 19-23 స్వా 21-23 రా 3-50 |
| 31 | గు | న 18-16 విశా 22-2 త్యా 3-58 |

1952 సంll ఆగస్టు నెల

| | | |
|---|---|---|
| 1 | శు | ద 15-56 అనూ 21-27 వరలక్ష్మీవ్రతం |
| 2 | శ | ఏ 12-28 జ్యే 19-45 త్యా 3-49 రా 7-13 |
| 3 | ఆ | ద్వా 7-55 మూ 17-1 త్యా 3-49 త్యా 3 46 దగ్ధయోగం |
| 4 | సో | త్ర 2-20 ఏష్యం 54-2 రా 0-32 త్యా 3-44 |
| 5 | మం | ○ పూ 49-59 ఉపా 9-17 ది 17-33 యజుర్వేదఉపాకర్మ |
| 6 | బు | కృష్ణపాడ్యమి 43-13 శ్ర 4-46 ది 14-1 ఋగ్వేదఉపాకర్మ గాయత్రిజపః |
| 7 | గు | వి 36-50 ధ 0-10 శత 55-30 ది 16-49 |
| 8 | శు | త 30-44 పూభా 51-43 ది 10-29 త్యా 3-44 |
| 9 | శ | చ 25-17 ఉభా 48-31 ది 14-20 అమృతయోగం |
| 10 | ఆ | పం 20-41 రే 46-15 ది 17-18 త్యా 3-51 తిథిద్వయం |
| 11 | సో | ష 17-6 అశ్వ 45-6 రా 3-51 త్యా 3-56 |
| 12 | మం | స 14-43 భ 45-8 ది 9-0 శ్రీకృష్ణాష్టమి |
| 13 | బు | అ 13-31 కృ 46-22 ది 15-40 త్యా 4-5 |
| 14 | గు | న 13 34 రో 48-48 ది 27-56 |
| 15 | శు | 14-49 మృ 52-21 ది 3-30 స్వాతంత్ర్య దినోత్సవం. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.